# సవ్యమైన పెంపకానికి శక్తి బోర్న్‌విటా శక్తి !



ఎదిగే వయసులోని చదువుకొనే పిల్లలకు రోజువారీ భోజనంవలన చేకూరే శక్తి చాలదు..వారికి కలిగే శక్తి అంతా చదువుల్లో ఆటలల్లో హరింపు అయిపోతుంది. పిల్లల సవ్యమైన పెంపకానికి సరియైన పోషణకు అధిక శక్తి చాలా అవసరం. తగిన శక్తిని సమకూర్చేందుకు వారికి ప్రతిరోజూ బోర్న్‌విటా ఇవ్వాలి. బోర్న్‌విటాతో పిల్లలు ఆరోగ్యంగా ఉత్సాహంగా ఉండగలరు. రుచికరమై శక్తి పోషకమైన బోర్న్‌విటా కోకో, పాలు, మాల్ట్, పంచదారల సంతులిత మిశ్రమము, మరి దీనిని తయారు చేసేవారు — క్యాడ్‌బరిస్






**శక్తి, ఉత్సాహం మరియు రుచికోసం-క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా !**

మీ ముఖ
సౌందర్యానికి











# రెమీ ®

టాల్కం పౌడర్

# ఆంధ్రప్రదేశ్

## 30-8-1969 తేదీన జరిగిన

మొదటి బహుమతి : రూ. **2,00,000**/- లక్షలు B. 488815 ★ రెండవ బహుమతులు : 2 ఒక్కొక్కటి

నాల్గవ బహుమతులు : 10 ఒక్కొక్కటి రూ. **5,000**/-

B. 646572
B. 272375
A. 369145
B. 267047
A. 315333
B. 025546
A. 579355
A. 012980
B. 060943
B. 026044

ఐదవ బహుమతులు : 40 ఒక్కొక్కటి రూ. **1,000**/-

B. 608460
A. 398492
B. 344479
A. 515749
B. 213794
A. 553899
B. 283599
B. 601588
B. 189764
A. 374114
B. 188517
A. 991663
A. 390389
B. 487176
A. 851566
B. 173565
B. 112380
B. 572619
A. 286029
B. 927642
B. 530693
A. 276144
B. 016211
A. 138985
B. 220652
A. 715602
B. 220229
A. 610593
A. 520567
A. 877389
B. 137496
A. 274131
B. 830933
A. 649948
A. 246545
A. 605495
B. 689109
A. 785991
A. 171982
B. 600882

ఆరవ బహుమతులు : 100ఒక్కొక్కటి రూ. **500**/-

A. 867680
A. 135938
A. 781475
B. 113275
B. 667564
B. 524556
B. 465927
B. 207806
B. 881826
A. 616072
B. 240262
A. 008598
A. 811301
B. 099382
B. 482937
B. 656215
B. 307142
A. 432444
B. 044982
B. 890938
A. 995612
B. 234426
B. 129704
B. 682575
B. 738588
B. 726117
A. 148163
A. 304430
B. 940880
B. 541095
A. 977104
A. 850659
A. 572920
A. 173667
B. 345381
B. 939673
A. 322038
A. 806442
B. 918446
A. 939483
A. 716970
B. 759144
B. 267967
A. 470598
A. 970191
A. 220189
C. 098025
B. 169638
B. 430477
A. 095076
A. 220290
B. 548180
A. 261340
A. 126495
A. 483037
A. 984904
A. 203610
A. 259811
A. 444094
A. 287712
B. 294513
A. 443504
A. 622287
B. 449800
A. 753004
B. 837409
A. 053066
B. 455530
B. 849510
A. 575903
A. 969449
A. 865316
B. 746524
A. 857138
B. 349736
B. 610876
A. 988830
A. 829429
C. 082108
C. 052873
B. 869530
B. 753571
A. 206541
A. 550618
B. 670420
B. 312397
A. 873531
B. 165451
A. 604378
B. 888292
A. 013845
B. 657767
A. 871767
A. 372743
B. 216996
A. 520705
B. 869061
A. 971156
B. 971061
A. 344070

ఏడవ బహుమతి : 200 ఒక్కొక్కటి రూ. **100**/-

B. 279831
B. 009085
B. 767368
B. 271374
A. 043648
B. 538292
B. 749290
B. 351951
A. 920792
A. 770884
B. 937561
A. 060382
A. 564680
B. 319901
A. 755124
B. 745301
A. 880795
A. 845220

# వెల్ ఫేర్ ఫండ్

## 9 వ రాఫిల్ డ్రా ఫలితాలు

| | | | | |
|---|---|---|---|---|
| రూ. **40,000/-** | A. 287464<br>A. 173883 | ★ | మూడవ బహుమతులు : 3 ఒక్కొక్కటి రూ. **20,000/-** | |
| | | A. 366265 | A. 691414 | A. 648091 |

| | | | | |
|---|---|---|---|---|
| B. 658514 | B. 092488 | B. 643729 | B. 705486 | A. 576106 |
| B. 303640 | B. 422096 | B. 678152 | A. 437858 | C. 080859 |
| A. 791246 | A. 821971 | B. 327709 | B. 758801 | A. 843605 |
| A. 680007 | B. 575181 | B. 123859 | A. 643034 | A. 686707 |
| A. 865834 | A. 791397 | B. 727012 | A. 097453 | A. 306167 |
| B. 159609 | A. 783314 | B. 289889 | A. 023674 | A. 411710 |
| A. 898944 | B. 409925 | B. 202225 | A. 716734 | A. 642176 |
| B. 875887 | A. 858891 | A. 630093 | A. 753274 | A. 246448 |
| B. 600736 | A. 032837 | B. 639181 | B. 769424 | A. 977554 |
| C. 076824 | B. 139536 | B. 949215 | B. 062738 | C. 070442 |
| B. 705453 | B. 987112 | C. 021244 | B. 649074 | C. 064461 |
| A. 443327 | B. 500777 | B. 504153 | B. 679718 | B. 998815 |
| A. 264226 | A. 147173 | C. 079924 | A. 279250 | B. 147659 |
| B. 070378 | A. 321123 | A. 664425 | A. 985660 | A. 931133 |
| A. 152937 | B. 629999 | A. 818253 | B. 452662 | B. 669463 |
| B. 487393 | B. 082396 | B. 572279 | B. 291292 | A. 101933 |
| B. 404755 | A. 092144 | A. 816991 | B. 696228 | A. 853176 |
| A. 942830 | B. 698803 | B. 132623 | A. 139634 | A. 653874 |
| B. 683983 | B. 136746 | B. 253715 | B. 329813 | C. 025021 |
| A. 366537 | B. 394303 | A. 521813 | B. 646703 | A. 810013 |
| B. 540197 | B. 612452 | B. 426651 | A. 305682 | A. 834011 |
| B. 723957 | B. 247759 | A. 070828 | A. 388856 | A. 422540 |
| B. 933430 | A. 592582 | A. 118955 | A. 056607 | A. 339385 |
| A. 948107 | A. 586041 | B. 578718 | A. 896042 | A. 888795 |
| A. 346224 | A. 110097 | A. 604000 | B. 466105 | A. 043473 |
| B. 523879 | A. 334418 | A. 074202 | C. 069390 | A. 562899 |
| A. 412856 | B. 814505 | B. 395129 | B. 859190 | B. 643178 |
| A. 108080 | A. 951310 | B. 352237 | B. 356223 | B. 773592 |
| C. 059097 | B. 431513 | A. 342433 | C. 055795 | B. 744439 |
| B. 247580 | B. 826670 | A. 551556 | B. 093591 | A. 013493 |
| A. 431996 | B. 252909 | A. 900469 | B. 806678 | B. 179222 |
| B. 319773 | B. 281149 | A. 272235 | A. 114408 | B. 587976 & |
| A. 796803 | B. 685141 | A. 186466 | | C. 080946 |
| A. 160697 | B. 633198 | A. 536834 | | |
| A. 109718 | A. 703358 | B. 250243 | | |
| A. 777955 | B. 023633 | B. 277397 | | |
| A. 124305 | B. 647133 | A. 501265 | | |
| B. 733467 | A. 949721 | A. 291344 | | |
| A. 376791 | B. 139548 | A. 212525 | | |

ఠాకూర్ వి. హరిప్రసాద్,

గౌరవ కార్యదర్శి.


LIFEBUOY
for health


అన్నతమ్ముల అనుబంధాన్ని
ప్రణయ జీవుల అనురాగాన్ని
ప్రతిభావంతముగా
రూపొందించిన చిత్రం!
తారకరామ పిక్చర్స్ వారి
భలే తమ్ముడు
దర్శకత్వం: బి.ఏ.సుబ్బారావు
నిర్మాత: ఎ.పుండరీకాక్షయ్య
VIJAYA
డిస్ట్రిబ్యూటర్సు: ఆంధ్ర: విజయ సీడెడ్: నవభారత్ నైజాం: దివ్యదత్తా
STUDIO Ketha

# చక్కటి కానుక

## ఫొటోగ్రఫీ వారిచే మొదలుపెట్టించుటకు




## క్లిక్ III







మీబాలుని పరిచయం చేయండి, ఛాయాచిత్ర కళాప్రపంచంలోని సౌందర్యానికి, ఒక క్లిక్ III కెమేరాతో. అది ఉపయోగించుట చాలా తేలిక. గుణించుట లాంటి గడబిడలు ఏమీలేవు. గురిచూచి మీటనొక్కితే చాలు. ప్రథమ ప్రయత్నంలోనే, అదిచేకూర్చుతుంది, ప్రజ్వలమైన ఫలితాలు. ప్రతిఫిల్ము రోలుతో తీయవచ్చు, పన్నెండు ప్రకాశవంతమైన చిత్రాలు. ఈపండుగ దినాలలో, మీబాలున కివ్వండి, కానుకగా ఒక క్లిక్ III కెమేరా. ఆరంభించుటకు, అనుక్షణం వెంట.అంటిపెట్టుకొని యుంచుకొనుటకు. అత్యుత్తమమైన కెమేరాఅదే.

అథరైజ్డ్ అగ్ఫాడీలర్ల అందరివద్ద లభిస్తుంది.



అగ్ఫా పర్యవేక్షణక్రింద,
AGI
ది న్యూఇండియా ఇండస్ట్రీస్ లిమిటెడ్, బరోడా,
వారిచే తయారు చేయబడినది.
సోల్ డిస్ట్రిబ్యూటర్స్:
అగ్ఫా గెవార్ట్ ఇండియా లిమిటెడ్, బొంబాయి • క్రొత్తఢిల్లీ. కలకత్తా • మద్రాసు.

# ఓవల్‌టీన్

## పరిచయము చేయు HSE "వండర్ బాయ్"

### అధిక శక్తిగల







వండర్ బాయ్ ఎవరు?

వండర్ బాయ్ ఆరోగ్యం, శక్తి, సత్తువకు చిహ్నము. ప్రతి ఓవల్‌టిన్ కప్పులో ఉంటాడు. ఓవల్‌టిన్ జీవితంలో మీరు సఫలులగుటకు కావలసిన ఆ కాస్త అదనపు శక్తిని కలిగిస్తుంది; జీవితాన్ని శక్యమైన మేరకు అనుభవించటానికి మీకు కావలసిన ఉత్సాహమును, జీవన శక్తిని పుట్టిస్తుంది.

వండర్ బాయ్ ఓవల్‌టిన్‌యొక్క సారము. రమ్యమైన, పోషకమైన ఓవల్‌టిన్, సహజాహారముల శ్రేష్ఠతతో నిండినది. బంగారు మాల్టు యొక్క మంచి—ఇతర పేయములలో కంటే ఎక్కువ; తాజా, మీగడ పాలు, ప్రోటీనులు, కార్బొహైడ్రేటులు, విటమినులు, ఖనిజాలు, పరిపూర్ణ సమ్మిశ్రణము. సమృద్ధమైన మాల్టు రుచి, అధిక శక్తి సమృద్ధము. ప్రతి దినము ఓవల్‌టిన్ త్రాగండి—ఆరోగ్యం, శక్తి, సత్తువ నింపుకొండి.

ఓవల్‌టిన్—ప్రపంచంలో ఎక్కువగా అమ్ముడుపోయే ఆహారపేయము. కుటుంబమంతటికి మంచిది.



ఏ. వాండర్ లిమిటెడ్, లండన్, వారి సాంకేతిక సహాయోగంతో
ఇండియాలో తయారుచేయువారు జగత్‌జిత్ ఇండస్ట్రీస్ లిమిటెడ్
సోల్ డిస్ట్రిబ్యూటర్లు: వోల్టాస్ లిమిటెడ్

ఈ రోజే సంతోషంలో ముంచి తేల్చు సంపూర్ణ వర్ణ చిత్ర-ఖండ (జిగ్‌సా) పజిల్ కోసం వ్రాయండి. హీరో—వండర్ బాయ్. మీరు చేయవలసిందంతా ఈ క్రింది కూపను పూర్తిచేయటమే. ఓవల్‌టిన్ డబ్బాలోని ఫాయిల్ సీల్ కత్తిరించి ఈ క్రింది అడ్రసుకు పంపండి.
జగత్‌జిత్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ - 54, రింగ్ రోడ్, న్యూ ఢిల్లీ-24.

పేరు ------------------------------------

చిరునామా ------------------------------------





# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈసారి ఫోటోవ్యాఖ్యలపోటీ బహుమతి ఒక సంస్థకు ఇస్తున్నాము. ఈ పోటీకి ఇచ్చిన ఫోటోలలో గాంధీ బొమ్మ ఉండటం లోగడ కూడా జరిగినా, ఈసారి, గాంధీజీ శతజయంతి ప్రభావం కాబోలు, పాఠకులు తమ వ్యాఖ్యలలో గాంధీజీ పట్ల తమకు గల భక్తినీ, గౌరవాన్నీ, అభిమానాన్నీ చక్కగా ప్రదర్శించారు.

నవంబరు "చందమామ" సంచిక ప్రత్యేక దీపావళిసంచికగా వెలువడుతున్నదని చెప్పటానికి సంతోషిస్తున్నాము.

సంపుటి 45 అక్టోబర్ '69 సంచిక 4




# హారంచెప్పినసాక్ష్యం

ఒక గ్రామంలో అంత సంపన్నులు కాని రైతు దంపతు లుండేవారు. వాళ్ళు తమ కున్న కొద్ది పొలం లో రోజూ పనిచేసుకుని సాయంకాలం ఇంటికి తిరిగి వస్తూండేవారు.

ఒక రోజు సాయంకాలం వాళ్ళు ఇంటికి తిరిగి వస్తూండగా దారిలో ఒక చెట్టు మీద ఒక కాకిగూడులో ఏదో మెరుస్తూ కన బడింది. భార్య కోరికపైన రైతు చెట్టెక్కి దాన్ని తీసుకుని కిందికి దిగివచ్చాడు.

అదొక ముత్యాల చేరు. అందులో రెండు వందల ముత్యాలున్నాయి. ఏ ముత్యాల వర్తకుడి సొత్తో అయి ఉండాలి. కాకి దాన్ని తెచ్చి గూట్లో పెట్టి ఉంటుంది.

ఆ దంపతులు ఇంటికిపోయి ఎంచి చూస్తే సరిగా రెండువందల ముత్యాలున్నాయి.

"అందులో సగం ముత్యాలతో మెడలోకి చక్కని దండ చేయించుకోవచ్చు," అన్నది రైతుభార్య.

"కంసాలి కిచ్చి చేయిస్తాలే," అన్నాడు రైతు. ముత్యాలకు తీగచుట్టించటం తేలికలో పనే.

రైతు ఒక వంద ముత్యాలను కంసాలి దగ్గిరికి తీసుకుపోయి, వాటితో హారం తయారుచేసి ఇవ్వమన్నాడు. కంసాలి ముత్యాలను లెక్కపెట్టి తీసుకుని, వారం రోజుల్లో హారం తయారుచేస్తా నన్నాడు.

వారం లోపల హారం తయారయింది. కాని కంసాలిభార్య దాన్ని తన మెడలో వేసి చూసుకుని, "ఇది నాదే!" అన్నది.

కంసాలి విలవిల్లాడాడు. కాని అతని భార్య చచ్చినా ఆ హారాన్ని ఇవ్వనన్నది.

వారంకాగానే, హారం తయారయిందా అంటూ రైతు వచ్చాడు. పూర్తికావచ్చిం దనీ, రెండు రోజుల్లో ఇస్తాననీ కంసాలి బొంకాడు. ఇలా వాయిదాల మీద ఒక నెల జరిగిపోయింది.

వి. శివకోటి నారాయణరెడ్డి

రైతుకు ప్రాణంవిసిగి, "నువు హారం చేసేటట్టు లేవులే. నా ముత్యాలు నాకు యిచ్చెయ్యి," అన్నాడు.

కంసాలి తెగబడి, "నువు నాకు ముత్యాలేవీ ఇవ్వలేదు," అన్నాడు.

"అంతదాకా వచ్చిందా? నేను నీమీద ఫిర్యాదు తెస్తాను," అన్నాడు రైతు.

"తెచ్చుకో, నన్ను బెదిరిస్తావా? నీ దగ్గిర ముత్యాలు ఎందుకున్నాయో అదీ చూస్తాం," అన్నాడు కంసాలి.

ఫిర్యాదు తేవటానికి రైతు కొంచెం జంకాడు. కాని రైతుభార్య, "మనం ఎవరి సొమ్మయినా దొంగిలించామా? ఈ కంసాలి పచ్చి దొంగ. న్యాయాధికారిగారి దగ్గిరికి వెళ్ళి జరిగినది జరిగినట్టు చెబితే మనకు ఏ నిందా రాదు. అందులోనూ మన ఊరి న్యాయాధికారి ధర్మదేవత అని చెప్పుకుంటారు," అన్నది.

రైతు తన వద్ద ఇంకా ఉన్న నూరు ముత్యాలూ తీసుకుని న్యాయాధికారి వద్దకు వెళ్ళి, జరిగినదంతా చెప్పాడు.

న్యాయాధికారి రైతుతో, "ఈ ముత్యాలు నా దగ్గిరే ఉంచు. నా దగ్గిర కంసాలి మీద ఫిర్యాదు చేసిన సంగతి ఇప్పుడప్పుడే ఎవరికీ చెప్పకు," అన్నాడు.




న్యాయాధికారి రమ్మంటున్నట్టు కంసాలికి కబురు వచ్చింది. కంసాలి వెళ్ళాడు. న్యాయాధికారి అతని ముందు ఒక సంచీ పెట్టి, "ఇందులో వంద ముత్యాలున్నాయి. వీటితో హారంచుట్టి ఇవ్వగలవా? సాధ్యమైనంత త్వరగా కావాలి," అన్నాడు.

"చిత్తం! ఎల్లుండి సాయంకాలానికల్లా సిద్ధం చేస్తానండి," అన్నాడు కంసాలి.

అతను ఆ ముత్యాల సంచీని ఇంటికి తెచ్చి చూస్తే తొంబైఆరుముత్యాలే ఉన్నాయి. న్యాయాధికారిలాటి పెద్దమనిషి నూరు ముత్యాలంటే నమ్మి తెచ్చాడు. నాలుగు తక్కువ ఉన్నాయని మళ్ళీ వెళ్ళి చెబితే,

తాను ఆ నాలుగూ కాజేసినట్టు న్యాయాధికారి అనుకోవచ్చు. ఎలాగురా భగవంతుడా అనుకుంటూ ఉండగా, రైతుకోసం తయారు చేసిన నూరు ముత్యాలుగల హారం జ్ఞాపకం వచ్చింది. దాన్ని తీసుకుపోయి న్యాయాధికారి కిచ్చి, తొంభై అరు ముత్యాలతో తన భార్యకు మరో హారం చేస్తే సరి!

పరిస్థితి అంతా విన్నాక కంసాలిభార్య ఈ ఏర్పాటుకు ఒప్పుకున్నది. రెండు రోజులాగి కంసాలి నూరు ముత్యాలుగల హారాన్ని తీసుకుపోయి న్యాయాధికారి కిచ్చి, "తమ హారం తయారుచేశాను, బాబూ! మార్పులూ చేర్పులూ ఏమన్నా కావాలంటే చెప్పండి, చేస్తాను," అన్నాడు.

న్యాయాధికారి కంసాలి మాటలు విని పించుకోకుండా హారంలోని ముత్యాలు లెక్కపెట్టి, తల ఎత్తి చూసి, "ఇది ఆ రైతుకు నువు చేసిపెట్టిన హారంలాగుంది. ఇందులో నూరు ముత్యాలున్నాయి. నేను నీ కిచ్చినవి తొంభైఅరు ముత్యాలే. నా హారం వేగిరం పట్టుకురా," అన్నాడు.

కంసాలి గుండె గుభేలుమన్నది. అతను తడబడుతూ, "లేదు, బాబూ. ఇది తమరి కోసం నేను తయారుచేసినదే. తమరు నాకు నూరు ముత్యాలూ ఇచ్చారు. తమరు చెప్పే రైతెవరో నాకు తెలీదు," అన్నాడు.

న్యాయాధికారి మండిపడి, "దౌర్భాగ్యుడా, నీ మోసం బయట పెట్టటానికే నే నిలా చేశాను. ఇది రైతుహారం అని నేను తెలుసుకున్నాక కూడా నన్ను వంచిస్తావా? ఇలాటి మోసాలు మరొకసారి చేసినట్టు తెలిస్తే నిన్ను కఠినంగా శిక్షిస్తాను. వెళ్ళి, నే నిచ్చిన ముత్యాలు పట్టుకురా. హారం అవసరం లేదు," అన్నాడు.

కంసాలి ముత్యాలను న్యాయాధికారికి ఇచ్చి, రైతు హారానికి చుట్టిన బంగారు తీగా, తన మజూరీ పోగొట్టుకోవటమే గాక, తన పెళ్ళాం చేత పడరాని తిట్లన్నీ పడ్డాడు.





# మరుగుజ్జులు

అంగదేశంలోని ఒక కుగ్రామంలో ఇద్దరు మరుగుజ్జు దంపతులు ఉండేవారు. వాళ్ళిద్దరూ సాధువులు; అందరితోనూ మంచిగా ఉంటూ ఎంతో అన్యోన్యంగా కాపరం చేస్తూ ఉండేవాళ్ళు. వాళ్ళ పేర్లు మకరుడూ, మకరీ.

ఒక వేసవికాలం వాళ్ళ గ్రామంలో చెరువు పూర్తిగా ఎండిపోయింది. మామూలు మనుషులు దూరప్రాంతం నుంచి నీరు కావళ్ళతో తెచ్చుకుని ఏదో విధంగా కాలక్షేపం చేస్తున్నారు. కాని మరుగుజ్జులకు జీవితం చాలా కష్టమనిపించింది. అందు చేత మకరుడు తన భార్యను వెంటబెట్టుకుని కొంత కాలంపాటు తమ అత్తవారి ఊరు వెళ్ళి ఉందా మనుకున్నాడు.

మకరుడు ఒక బుల్లి తోపుడుబండి సంపాదించి, అందులో మకరిని కూర్చోబెట్టి తోసుకుంటూ అత్తవారి ఊరికి బయలు దేరాడు. గతుకుల దారి కావటం చేత మకరుడికి బండిని తొయ్యాటమూ ఆయాసంగానే ఉంది; బండి ఎగిరెగిరి పడుతూండటాన మకరికీ శ్రమగానే ఉన్నది. వాళ్ళు అలా శ్రమపడి ప్రయాణం చేసి మధ్యదారిలో ఉన్న తుమ్మలతోపు మధ్యకు చేరుకున్నారు.

ఆ తుమ్మలతోపులో పిల్లిపిశాచా లనే హీనజాతి పిశాచా లుండేవి. అవి అప్పుడప్పుడూ ప్రయాణీకులను ఏడిపిస్తూ ఉండేవి. ఈ మరుగుజ్జు దంపతులను ఏడిపించాలని రెండు పిల్లిపిశాచాలకు దుర్బుద్ధి పుట్టింది. అవి అచ్చు మకరీ మకరుల లాగే రూపాలు ధరించాయి. పిశాచిమకరుడు పిశాచిమకరిని ఒక తోపుడుబండిలో పెట్టి తోసుకుంటూ మకరుడికి ఎదురు వచ్చాడు.

ఎవరో ప్రయాణీకులు ఎదురు రావటం దూరం నుంచే చూసిన మకరుడు, కాస్సేపు

ఇ. కోటేశ్వరరావు



అగి, కబుర్లు చెప్పుకుని, విశ్రాంతి తీసుకో వచ్చుగదా అని మొదట సంతోషించాడు. ఆ వచ్చేవాళ్ళు తమ లాగే మరుగుజ్జులని తెలియగానే అతను ఆశ్చర్యపోయాడు. మరింత దగ్గిరికి వచ్చినాక వాళ్ళు కూడా అచ్చు తమ లాగే ఉండటం చూసి నిర్ఘాంత పోయాడు.

మకరు డేమీ అనకముందే పిశాచిమక రుడు, "నా పేరు మకరు డంటారు. ఇది నా భార్య మకరి. నేను మా అత్తవారూరు వెళ్ళి స్వగ్రామానికి తిరిగి పోతున్నాను. మీ రెవరు? మీ ప్రయాణం ఎక్కడిదాకా?" అని అడిగాడు.

అసలే కంగారులో ఉన్న మకరుడికి ఈ మాటలు వినేసరికి మతే పోయి నట్టయింది. అతను పిశాచిమకరుడితో, "మీ మాటలు వింతగా ఉన్నాయి. నా పేరు మకరుడు. ఇది నా భార్య మకరి. మా ఊళ్ళో చెరువు ఎండిపోతే మా అత్తవారి గ్రామానికి బయలుదేరాం," అన్నాడు.

ఈ మాటకు పిశాచిమకరుడు చప్పున కోపోద్రేకం తెచ్చుకుని, "మే మంటే అంత వెటకారంగా ఉందా? చూడు నిన్నేం చేస్తానో!" అని కయ్యానికి కాలుదువ్వాడు.

మకరుడికి కోపం వచ్చింది. "నీకే మమ్మల్ని చూస్తే వేళాకోళంగా ఉన్నట్టు నాకు తోస్తున్నది. కోపం వస్తే నేనూ మని షిని కాను!" అన్నా డతను కొట్లాటకు సిద్ధపడుతూ.

అంత దాకా తోపుడుబళ్ళలో కూర్చుని ఉన్న ఆడవాళ్ళిద్దరూ చప్పున కిందికి దూకి ఇద్దరు మగవాళ్ళకూ మధ్య అడ్డు వచ్చి, "ఆగండి, తొందర పడకండి!" అని అరిచారు.

మకరుడు తనకు సమీపంగా వచ్చిన పిశాచిమకరిని పక్కకు లాగుతూ, "నువ్వు ఊరుకో! ఈ ధూర్తుడి సంగతేమిటో తేలు స్తాను," అన్నాడు.

"మోసం, మోసం! నీ పెళ్ళాం అది కాదు, నేను!" అంటూ అసలు మకరి వచ్చి మకరుడి చెయ్యి పట్టుకున్నది.

"దాని మాట నమ్మకు. అసలు మకరిని నేను!" అంటూ పిశాచిమకరి మకరుడి రెండోచెయ్యి పట్టుకున్నది.

మకరుడికి మతి పూర్తిగా పోయింది. అప్పుడు పిశాచిమకరుడు గట్టిగా నవ్వి, "మనం అవతలికిపోయి ఓ మాట అనుకుందాం రా," అని మకరుణ్ణి పిలిచాడు.

ఇద్దరూ ఒక పొదచాటుకు వెళ్ళారు. పిశాచిమకరుడు అసలు మకరుడితో, "ఏమీ లేదులే!" అని మళ్ళీ నవ్వి వెనక్కు బయలుదేరాడు.

పొదకు రెండు వైపుల నుంచీ ఒకే రకంగా ఉన్న మకరులు వచ్చేసరికి, వారిలో తన భర్త ఎవరో చచ్చినా తెలియలేదు మకరికి.

మళ్ళీ మకరుల మధ్య వాగ్వాదం ఆరంభమయింది. దారే వెళ్ళేవారు ఆగి తమాషా చూడసాగారు. వారిలో బుద్ధిమంతుడొకాయన, "మీ తగాదా తీరాలంటే న్యాయాధికారి వద్దకు వెళ్ళండి. మీ రెంతసేపు జగడమాడినా నిజం బయటపడదు," అని సలహాయిచ్చాడు.



ఇద్దరు మకరులూ, ఇద్దరు ఆడవాళ్ళూ ఆయన వెంట సమీపంలో ఉన్న న్యాయాధికారి వద్దకు వెళ్ళారు.

దురదృష్టవశాన ఆ న్యాయాధికారి కూడా మరుగుజ్జే. ఈ ఫిర్యాదులు తనను అపహాస్యం చెయ్యటానికి వచ్చారనుకుని, "వీళ్ళలో ఎవరు అసలువాళ్ళో, ఎవరు నకలువాళ్ళో నాకు మాత్రం ఏం తెలుస్తుంది? నిజం చెప్పేదాకా నలుగురినీ చింతబరికెలతో బాదండి," అని ఆయన తన భటులకు ఉత్తరు విచ్చాడు. నలుగురు మరుగుజ్జులూ ఒక్కసారిగా, చెవులు చిల్లులు పడేటట్టు కేకలు పెట్టసాగారు. ఆ కేకలు

విని జనం గుమికూడారు. చాలా రభస అయింది.

ఆ సమయానికి మహామంత్రిగారు పల్లకీలో, సపరివారంగా అటుగా వెళ్ళుతూ ఈ కలవరం చూసి ఆగి, మేనా దిగి వచ్చి, న్యాయాధికారిని, "చేపల బజారా? ఇది న్యాయస్థానమా?" అని అడిగాడు.

న్యాయాధికారి మహామంత్రికి సాష్టాంగపడి లేచి, "ఎంత పెద్ద కుట్ర చేస్తున్నారో చూడండి. ఈ మగవాళ్ళిద్దరికీ తేడా లేదు. ఈ ఆడవాళ్ళిద్దరూ ఒకే అచ్చులో పోత పోసినట్టున్నారు. నన్ను మభ్యపెట్టటానికి వచ్చారు. నిజం చెప్పిన దాకా చింతబరికెలతో చావగొట్టింతా మనుకుంటున్నాను," అని చెప్పాడు.

మహామంత్రి క్షణం ఆలోచించాడు. ఇదేదో పిల్లిపిశాచాల ఎత్తుగడేనని ఆయనకు తోచిపోయింది. ఆయన న్యాయాధికారితో, "ఏమీ అవసరం లేదు. నీ చింతబరికెలు వీళ్ళకు లక్ష్యం లేదు. నా వెంట భద్రయ్యా ఉన్నాడు. వాడి చేత భైరవచక్రం వేయించి, అందులో ఈ నలుగురినీ కూర్చోబెట్టితే పిల్లిపిశాచాల పాట్లు అప్పుడు తెలుస్తాయి. ఎవడురా అక్కడ? భద్రయ్యాను పిలుచుకురండి!" అన్నాడు.

మరుక్షణమే పిశాచిమకరుడూ, పిశాచిమకరీ మాయమైపోయారు. మహామంత్రి అసలు మకరీ మకరులతో, "ఇక మీ దారిన మీరు వెళ్ళండి. క్షుద్ర పిశాచాలు ఎదురైనట్టు కనిపిస్తే వాటితో మాట్లాడక మీ దారిన మీరు వెళ్ళండి. అవి మిమ్మల్ని ఏమీ చెయ్యావు!" అని సలహా ఇచ్చాడు.

ఇంతలో న్యాయాధికారి వచ్చి, "మహాప్రభూ, మీ పరివారంలో భద్రయ్యా అనే వాడు వున్నట్టు లేడే!" అన్నాడు.

"పోనీలే! వాడితో పని కూడా లేదులే," అంటూ మహామంత్రి పల్లకీ ఎక్కి ముందుకు సాగిపోయాడు.






## 22

[అఘోరీలు శిఖిముఖితో రాజీమాటలు మాట్లాడి తమ దారిన వెళ్ళిపోయారు. రాత్రివేళ శత్రువులు తమ మీదికి దొంగచాటుగా వదిలిన చిరుతపులిని శిఖిముఖివాళ్ళు చంపారు. వాళ్ళకు సాయపడిన జాంగలాను, గాయపడిన వాడి మిత్రుడు ఎక్కడున్నదీ తెలుసుకునేందుకు, ముందుండి దారి తీయమని శిఖిముఖి ఆజ్ఞాపించాడు. తరవాత—]

కాగడాకాంతిలో శిఖిముఖీవాళ్ళు పొదల పక్కగా నడుస్తూ, గాయపడిన శత్రువు కోసం వెతకసాగారు. వారి కొక పొద దగ్గిర నెత్తురు మరకలు కనిపించినై. అక్కడ విరిగిన కొన్ని చెట్టురెమ్మలూ, ఆకులూ చెల్లాచెదురుగా పడివున్నవి.

"కేసరీ, వాడు నీ బాణందెబ్బ తిన్నది, యీ పొద దగ్గిరే. కాని, ఎలాగో యిక్కణ్ణించి పారిపోగలిగాడు. తెల్లవార వస్తున్నది. ఇంకా యిక్కడ కాలయాపన చెయ్యటం ఎందుకు? ప్రయాణసన్నాహాలు చేద్దాం," అన్నాడు శిఖిముఖి.

"మన ప్రయాణానికి దారి చూపి సాయపడేవా డెవడు? ఈ జాంగలా శత్రుపక్షంవాడని తేలిపోయింది గదా?" అన్నాడు విక్రమకేసరి.

"ఏ పక్షంవాడయినా, వీడు ప్రస్తుతానికి మన అధీనంలో వున్నాడు. కామాఖ్య



నగరం నుంచి బయలుదేరేటప్పుడు, వీడు మనను ఇభ్యుజాతివాళ్ళు నివసించే గోల్ భరా గ్రామం చేరుస్తానని మాట యిచ్చాడు. ఆ పని వీడిచేత చేయించుదాం," అన్నాడు శిఖిముఖి.

"ఇంకా యీ దుర్మార్గుణ్ణి నమ్మటమా? మనను తప్పుదారి పట్టించి, ఆ శిథిలాలయ పూజారికి ఒప్పచెప్పగలడు!" అన్నాడు విక్రమకేసరి.

"అలాంటి భయం ఏమీ లేదు. ఏదైనా మోసం చేయబోతున్నట్టు అనుమానం కలిగిన మరుక్షణం, ఈ జాంగ్‌లాను కత్తితో ముక్కలు ముక్కలుగా నరుకుతాను. మన కొచ్చిన చిక్కేమిటంటే, ఈ మహారణ్యాల్లో, నదీ లోయల్లో వీడు తప్ప, దారి చూపగల వాడు మరొకడు లేడు. వీణ్ణే అందుకు ఉపయోగించుకోక తప్పదు," అన్నాడు శిఖిముఖి.

"ఆ ఉపయోగించుకోవటం అదీ నీవే చూసుకోవాలి. నేను మాత్రం ఈ జాంగ్‌లాను ఒక్క క్షణం కూడా నమ్మను," అన్నాడు విక్రమకేసరి.

"నేనూ అంతే," అని శిఖిముఖి, జాంగ్‌లా కేసి తిరిగి, "జాంగ్‌లా, నిజం చెప్పు. నీకు డబ్బు మీద ఎక్కువ ఆశా, ప్రాణం మీద ఎక్కువ ఆశా?" అని ప్రశ్నించాడు.

జాంగ్‌లా ఓ క్షణకాలం తటపటాయించి, తరవాత చిన్నగొంతుతో, "శిఖిదొరా! నాకు రెంటి మీదా సమానమైన ఆశే వున్నది. ఒకటి లేకపోతే రెండోది వృథా!" అన్నాడు.

"ఎంత విశ్వాసఘాతుకుడివైనా, ఇప్పుడు అజాగ్రత్తవల్లనో, పరధ్యానం చేతనో నిజం చెప్పినట్టు కనబడుతున్నావు. ఈ క్షణం నుంచీ నీ ప్రాణం నా గుప్పిట్లో వున్నది. ఎలాంటి మోసం చేయకుండా గోల్‌భరాకు మమ్మల్ని చేర్చిన మరునిమిషంలో నీకు

స్వేచ్ఛ యిస్తాను; కొంత ధనం కూడా యిస్తాను. విన్నావా?" అన్నాడు శిఖిముఖి.

"విన్నాను, దొరా! కామాఖ్యనగరంలో శిథిలాలయ పూజారి అంతులేని ధనం ఆశ చూపి, నన్ను వక్రమార్గం పట్టించాడు. ఇకనుంచీ మీకు విశ్వాసపాత్రుడుగా బతుకుతాను," అన్నాడు జాంగ్‌లా.

శిఖిముఖి తలవూపి, జాంగ్‌లాను ముందు నడవమని, విక్రమకేసరితో రాత్రి తాము బసచేసిన చెట్టు దగ్గిరకు బయలు దేరాడు. వాళ్ళు ఆ చెట్టు దగ్గిరకు వచ్చే సరికి అజితుడూ, వీరభద్రుడూ ఎర్ర గండుతో వినోదంగా ఆడుకుంటున్నారు. శిఖిముఖిని చూస్తూనే కుక్క అతడి దగ్గిరకు పరిగెత్తుకు వచ్చింది.

శిఖిముఖి, ఎర్రగండు తల నిమురుతూ, "మత్తుమందు దెబ్బ నుంచి యిప్పటికి కోలుకున్నావన్న మాట! ఇదుగో, ఆ మందు ప్రయోగించినవాణ్ణి ఓ కంట కనిపెట్టి వుండు. పారిపోవాలని చూస్తే, మమ్మల్ని హెచ్చరించ నవసరం లేదు, కంఠం కొరికి నెత్తురు తాగు," అన్నాడు జాంగ్‌లాను చూపుతూ.

ఎర్రగండు చిన్నగా మొరిగింది. జాంగ్‌లా వెలవెలపోతూ, "నేనిక నుంచి




తమకు విశ్వాసపాత్రుడైన సేవకుణ్ణి, దొరా!" అన్నాడు.

"ఆ సంగతి ముందుముందు నువ్వు రుజువు చేసుకోవలసి వున్నది. ప్రస్తుతానికి తాడుతో నీ చేతులు వెనక్కు విరిచికట్టి, పారిపోకుండా వుండేందుకు కంచరగాడిద మెడకు, ఆ తాడు బిగించబోతున్నాను," అన్నాడు శిఖిముఖి.

ఆ తరవాత అందరూ కలిసి తమ సామానులను రెండు కంచరగాడిదల మీదా వేసి తాళ్ళతో గట్టిగా కట్టారు. అజితుడు, జాంగ్‌లా చేతుల్ని వెనక్కు లాగి తాడుతో బలంగా ముడివేసి, రెండవ కొసను కంచర





గాడిద మెడకు కట్టాడు. శిఖిముఖి ఆజ్ఞాపించగానే జాంగ్‌లా ముందుండి దారి తీయసాగాడు.

మిట్టమధ్యాహ్నం వరకూ వాళ్ళు అరణ్యంలో నడిచి, ఒక లోయలో ప్రవహిస్తున్న ఒక నది పాయను చేరారు. అది హిమాలయాల్లో పుట్టిన ఏదో ఒక పెద్ద నదికి ఉపనది అయివుంటుంది. నదిలో అక్కడక్కడా ఎత్తయిన రాళ్ళగుట్టలు వున్నవి. వాటి మీదా, నది అంచులనా అనేక వందల సంఖ్యలో మొసళ్ళు వున్నవి.

శిఖిముఖి ఆ మొసళ్ళ కేసి వింతగా చూస్తూ, "కేసరీ! మనం బహుశా యీ నది దాటవలసి వుంటుందనుకుంటాను. నీటి వేగం హెచ్చుగా వున్నా, నది వెడల్పు నూరు గజాలకన్న ఎక్కువ వుండదు. కాని, యీ మొసళ్ళకు చిక్కకుండా దీన్ని దాటటం పెద్ద చిక్కు సమస్యే," అన్నాడు.

"జాంగ్‌లా కావాలని మన నిక్కడికి నడిపించాడేమో అని నా అనుమానం. గోల్‌భరా గ్రామం చేరేందుకు యీ నదిని దాటవలసిన అవసరం వున్నదో లేదో వాణ్ణి అడిగి చూస్తాను," అన్నాడు కేసరి.

అందరికన్న ముందు నడుస్తున్న జాంగ్‌లాను సమీపించి విక్రమకేసరి, "జాంగ్‌లా! ఈ మొసళ్ళ నదికి దారి తీశావేం! గోల్‌భరా యింకెంత దూరం?" అని అడిగాడు.

జాంగ్‌లా రొప్పుతూ, "ఈ నదీతీరం వెంట నాలుగైదు కోసుల దూరం పోయి, ఒక కొండచరియ దాటి వెనక్కు తిరిగి ఒక కోసు దూరం వస్తే, గోల్‌భరా గ్రామం చేరవచ్చు. అలా కాక యిక్కడే నది దాటి వెళితే, ఆ గ్రామం సుమారు రెండు కోసుల దూరంలో వుంటుంది," అన్నాడు.

"నీ కోసుల లెక్క ఏదో కాస్త తికమకగా వున్నది. నదిలో యిన్ని మొసళ్లు వుండగా ప్రాణాపాయం లేకుండా దీన్ని దాటటం ఎలా?" అన్నాడు విక్రమకేసరి.





"చెట్లకొమ్మలు గాని, బోదెలు గాని నరికి తెప్పలు కట్టి వాటి మీద నది దాట వచ్చు, దొరా," అన్నాడు జాంగ్‌లా.

అంతలో అక్కడికి శిఖిముఖి వచ్చాడు. విక్రమకేసరి జాంగ్‌లా చెప్పినదంతా అతడికి చెప్పి, నీ అభిప్రాయం ఏమిటని అడిగాడు.

"ఇది కొంచెం తాపీగా ఆలోచించవలసిన సంగతి. మనను యీ జాంగ్‌లా గోల్‌భరా గ్రామం చేరుస్తున్నాడో, లేక శిథిలాలయ పూజారి మాటు పెట్టుకు కూచున్న చోటుకు చేర్చబోతున్నాడో ముందుగా తెలుసుకోవాలి. ముందు యిక్కడ వంటపనులు కానిచ్చి, భోజనాలు ముగించుకుని తరవాత ఏం చేయవలసిందీ ఆలోచిద్దాం," అన్నాడు శిఖిముఖి.

ఆ వెంటనే కంచరగాడిదల మీంచి సామానులు దించి అజితుడూ, వీరభద్రుడూ వంటపని ప్రారంభించారు. శిఖిముఖి, జాంగ్‌లా చేతికట్లు విప్పి, పారిపోవాలని ప్రయత్నిస్తే చావు తప్పదని హెచ్చరించాడు. ఈ లోపల విక్రమకేసరి ఒక ఎత్తయిన చెట్టు ఎక్కి, అక్కణ్ణించి పరిసరాలు పరిశీలించాడు. అతడికి నది అవతల షుమారు రెండుమూడు కోసుల దూరంలో, ఒక కొండ



వాదం దగ్గిర్నుంచి పొగ వస్తూండటం కనిపించింది.

విక్రమకేసరి చెట్టు దిగి వచ్చి, శిఖిముఖికి యీ సంగతి చెప్పి, "అది గోల్‌భరాయే కావచ్చు," అన్నాడు.

"అయే వుంటుంది. భోజనాలైన తరవాత జాంగ్‌లాను చెట్టెక్కించి ఆ పొగ ఎక్కణ్ణించి వస్తున్నదో చూసి చెప్పమందాం. శిథిలాలయ పూజారి కూడా మన దారి తెన్నులు చూస్తూ, యీ ప్రాంతాల్నే ఎక్కడో వున్నట్టు తెలుస్తున్నది గదా. మనం తగు జాగ్రత్తలో వుండాలి," అన్నాడు శిఖిముఖి.




తరవాత అందరూ చెట్లనీడన కూర్చుని భోజనాలు చేశారు. నదిలో నుంచి నీరు తేవటానికి పోయిన అజితుడూ, వీరభద్రుడూ ఎంతో శ్రమపడి మొసళ్ళను బెదరకొట్టి పాత్రల్లో నీళ్ళు నింపుకోవలసి వచ్చింది.

"కేసరి దొరా! ఈ నదిని మనం దాటాలని చూడటం ప్రమాదకరం. నది వెంట ఎగువకు పోయి, యీ జాంగ్‌లా చెప్పిన కొండచరియ ఏదో దాటి, గోల్‌భరా చేరటం బావుంటుంది," అన్నాడు అజితుడు.

"అదే ఆలోచిస్తున్నాం. అసలు యీ మోసకారి మాటల్లో వున్న నిజమెంతో ముందు తెలుసుకోవాలి గదా," అన్నాడు విక్రమకేసరి.

శిఖిముఖి, జాంగ్‌లాను దగ్గిరకు పిలిచి, దాపులనున్న మహావృక్షం ఒకటి ఎక్కి చుట్టుపక్కల పూజారిముఠాగాని, ఏదైనా గ్రామంగాని వున్నదేమో చూడమన్నాడు.

జాంగ్‌లా ఎలుగుబంటిలా చకచకా చెట్టు మీదికి పాకిపోయి, చుట్టూ ఓ మారు కలయ చూసి, చిన్నగా నవ్వుకుని చెట్టు దిగి వచ్చాడు. వాడు నవ్వుకోవటం శిఖిముఖీ వాళ్ళు గమనించలేదు.

జాంగ్‌లా, శిఖిముఖి దగ్గిరకు వచ్చి, "దొరా! దూరాన కొండల్లో గోల్‌భరా గ్రామం కొంచెంగా కనబడుతున్నది. గ్రామం చుట్టూ అరణ్యం కావటంతో కొత్త వాళ్ళు దాన్ని గుర్తించటం కష్టం. ప్రయాణమవుదామా?" అని అడిగాడు.

"ప్రయాణం యిప్పుడు కాదు, ఎండ తగ్గి చల్లబడిం తరవాత. నీ మిత్రులు— ఆ పూజారి ముఠా నది అవతల ఎక్కడైనా కనిపించిందా?" అని అడిగాడు శిఖిముఖి.

ఆ ప్రశ్న వింటూనే జాంగ్‌లా కొంచెంగా వణికి, "నన్నింకా నమ్మటం లేదా, దొరా! ఆ దుర్మార్గులు నా కంటబడితే ప్రాణాలతో వదలను," అన్నాడు.

"ఇదీ రుజువు కావలసిన సంగతే. కాని, ఒకవేళ నువ్వు ఏదైనా మోసానికి సాహసిస్తే మాత్రం నిన్నూ నేను ప్రాణాలతో వదలను," అన్నాడు శిఖిముఖి.

జాంగ్‌లా చేతులు రెండూ ఎత్తి శిఖిముఖికి నమస్కరిస్తూ, ఏమో చెప్పబోయేంతలో మేతకు వదిలిన కంచరగాడిదల్లో ఒకటి, నది ఒడ్డునే వున్న ఒక చెట్లపొద దగ్గిర్నుంచి పెద్దగా అరుస్తూ, దూరంగా పారిపోసాగింది. శిఖిముఖి, అజితవీరభద్రుల్ని దాన్ని మళ్ళ వేసుకురమ్మని చెప్పబోయేంతలో, జాంగ్‌లా కర్ర ఒకటి తీసుకుని; గాడిద కేసి పరిగెత్తాడు.

విక్రమకేసరి చప్పున విల్లంబులు చేతబట్టి, జాంగ్‌లా కేసి గురి చేశాడు. ఒకవేళ వాడు అరణ్యవృక్షాల్లోకి పారిపోవాలని చూస్తే, బాణంతో కొట్టటానికి అతడు సిద్ధంగా వున్నాడు.

ఈలోపల అజిత వీరభద్రులు కూడా అటుకేసి బయలుదేరారు.

జాంగ్‌లా పరిగెత్తుతున్నవాడల్లా నది ఒడ్డునున్న చెట్లపొద దగ్గిరకు వెళ్తూనే తక్కున ఆగిపోయాడు. పొదలో నుంచి ఒక చిరుతగండు కోపంతో అరిచింది. అది ఆ సమయంలో అక్కడ తాను చంపిన లేడి నొకదాన్ని తింటున్నది. ముందు



కంచరగాడిదా, తరవాత జాంగ్‌లా అక్కడికి పోయి దాన్ని రెచ్చకొట్టారు.

చిరుతపులి పొదలో నుంచి తల బయిటికి పెట్టింది. పొదకు ఒక గజం దూరంలో జాంగ్‌లా భయకంపితుడై, వెనక్కు అడుగు వేసేందుకూడా శక్తిచాలక నిలబడి పోయాడు. ఒక తృటికాలం యిలా చిరుత పులీ, వాడూ ఒకరి ముఖాలొకరు చూసుకుంటూ స్థాణువుల్లా కదలామెదలక వుండిపోయారు. అంతలో చిరుత కసిగా అరిచి, జాంగ్‌లా కేసి లంఘించింది. జాంగ్‌లా చావు ఎలానూ తప్పదనుకుని కర్రతో బలంగా చిరుతపులి తల మీద కొట్టాడు. కాని, చిరుత బలం ముందూ, వేగం ముందూ అతడి శక్తి కొరగానిదైపోయింది.

చిరుతపులి, తన గొంతుపట్టుకోకుండా జాంగ్‌లా దాని మెడ మీద బలంగా ముష్టిఘాతా లివ్వసాగాడు. అది కాళ్ళతో వాడి నడుం పట్టుకుని విదిలించింది. చిరుతా, జాంగ్‌లా కూడా ఒకళ్ళనొకళ్ళు బలంగా పట్టుకుని వుండటంతో, ఆ ఊపుకు పల్లంగా వున్న నదిలోకి దొర్లుకుంటూ పోయి, ప్రవాహంలో పడ్డారు.

ప్రవాహంలో పడినా ఒకళ్ళనొకళ్ళు వదలకుండా సంఘర్షిస్తున్న చిరుతా, మనిషీ మీదికి పదీ పన్నెండు మొసళ్ళు అన్ని వైపుల నుంచీ వేగంగా వచ్చిపడినై. క్షణాల మీద జరిగిపోయిన యీ ఘోరం చూసి, శిఖిముఖి నిశ్చేష్టుడైపోయాడు. కాని, విక్రమకేసరి, మొసళ్ళ కేసి బాణం తరవాత బాణం కొట్టసాగాడు.

పోరాడుతూ ప్రవాహం వెంట కొట్టుకుపోతున్న చిరుతపులీ, జాంగ్‌లాల కేసి, నది అవతలి ఒడ్డునున్న చెట్లలో నుంచి బాణాలు రివ్వురివ్వు మంటూ రాసాగినై. అక్కడెవరో దాగివుండి జాంగ్‌లాకు తగలకుండా, గురిగా చిరుతపులి మీదికి బాణాలు వదులుతున్నారు. —(ఇంకా వుంది)





# భ్రాతృహంతకులు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ పట్టుదల అపూర్వమే గాని, ఎట్టి పరిస్థితులలోనూ అన్యాయం చెయ్యకుండా ఉన్నట్టయితే నీకు విజయం చేకూరుతుంది. ఒక్క చిన్న అన్యాయం ఎలా సర్వనాశనానికి దారి తీస్తుందో తెలియగలందులకు నీకు నిషధ రాజైన ద్యుమత్సేనుడి కథ చెబుతాను, శ్రమతెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

నిషధ రాజైన ద్యుమత్సేనుడికి చిత్రసేనుడూ, విచిత్రసేనుడూ, మహత్సేనుడూ అని ముగ్గురు కొడుకులుండేవారు. వారిలో చిత్రసేన, విచిత్రసేనులు దుర్మార్గులూ, హీనబుద్ధులూ కావటం రాజును చాలా

## బేతాళ కథలు



అందుచేత ద్యుమత్సేనుడు ఏం చేశాడంటే, తన రాజ్యాన్ని మూడు భాగాలు చేసి, తన ముగ్గురు కొడుకులకూ పంచి ఇచ్చి, ఎవరి రాజ్యభాగాన్ని వారు ఏలుకునేటట్టు ఏర్పాటు చేశాడు. అయితే ఈ రాజ్యవిభజన మాత్రం అంత న్యాయంగా జరగలేదు.

పెద్దవాళ్ళిద్దరికీ తండ్రి పంచి ఇచ్చినవి అరణ్యప్రాంతాలూ, కొండప్రాంతాలూనూ. రాజధాని అయిన మాహిష్మతీపురమూ, దాని చుట్టుపట్లగల నాగరికప్రాంతాలూ మూడోవాడివయాయి. ఆ భాగానికి మహత్సేనుణ్ణి రాజుగాచేసి, ద్యుమత్సేనుడు తాను వెంటవుండి రాజ్యపాలనలో అతడికి సహాయపడసాగాడు.

బాధించేది. మహత్సేనుడు సర్వలక్షణ సమన్వితుడు. అన్నివిధాలా అతనే రాజ్యార్హుడు. ద్యుమత్సేనుడికి మూడవవాడిపైనే ప్రాణాలన్నీ.

తాను సింహాసనంపైన ఉంటూనే ప్రాణాలు విడిస్తే రాజ్యం సంప్రదాయానుసారం చిత్రసేనుడికి పోతుంది. అన్నలు మహత్సేనుడికి ఏమాత్రమూ న్యాయం చెయ్యరు. తాను బతికివుండగానే ఆయన తన మూడోకొడుకును రాజుగా అభిషేకిస్తే కాదనేహక్కు ఎవరికీ ఉండదు; కాని పెద్దకొడుకుల దుర్మార్గబుద్ధులు తెలియని లోకం దీన్ని హర్షించదు.

చిత్రసేన, విచిత్రసేనులు తమకు అన్యాయం జరిగిందని, ఎలాగైనా మహత్సేనుడి రాజ్యభాగాన్నికూడా కాజెయ్యటానికి ప్రయత్నాలు సాగించారు.

తన అన్నలు తనను హతమార్చటానికీ, తన రాజ్యభాగాన్ని కాజెయ్యటానికీ ప్రయత్నిస్తున్నట్టు వార్తలు అందగానే మహత్సేనుడు జరిగినదానికి చాలా నొచ్చుకున్నాడు. అతను తన అన్న లిద్దరికీ ఈ విధంగా కబురు చేశాడు:

"మన తండ్రిగారు చేసిన రాజ్యవిభజన మీకు సమ్మతం కానిపక్షంలో మరొక రకంగా మనం రాజ్యాన్ని పంచుకోవటానికి నాకేమీ అభ్యంతరం లేదు. ఒక గర్భాన పుట్టిన మనం సఖ్యంగా ఉండటమూ, మన మధ్య శాంతి ఉండటమూ ప్రధానం. శాంతి కోసరం నేను నిరాయుధుడనై మీరు రమ్మన్న చోటికి వస్తాను. రాజ్యవిభజన మీరెలా చేసినా నేను అభ్యంతరం చెప్పను. మన సమావేశం ఎక్కడ, ఎప్పుడు జరిగేదీ నాకు తెలియబరచండి."

మహత్సేనుడి ఈ ధోరణి చూసి అన్నలు శాంతించి, తృప్తిపడ్డారు. ఫలాని రోజుకు ఫలాని చోట ముగ్గురు అన్నదమ్ములూ సమావేశం అయి సంప్రతించు కోవాలని నిర్ణయం జరిగింది.

ఆ మర్నాడు మహత్సేనుడు గుర్రం మీద, కొద్దిమంది పరివారంతో, సంకేత స్థలానికి బయలుదేరాడు.

అతను ప్రయాణమై వస్తుంటే దారి పొడుగునా ప్రజలు అతన్ని దేవుణ్ణి చూసినట్టు చూశారు. అతని అన్నల రాజ్యభాగాలలో ఉన్న ప్రజలే, "రాజంటే అలా ఉండాలి! ఏమి రాజకళ! ఏమి ఠీవి!" అని బహిరంగంగా మెచ్చుకున్నారు. అతను మజిలీ చేసిన చోటనల్లా అతన్ని అందరూ "మహా






రాజా!" అని సంబోధించటమే గాక, రాజోపచారాలు చేశారు.

ఇది చూసి చిత్రసేన, విచిత్రసేనులకు పట్టరాని ఈర్ష్య పుట్టుకొచ్చింది. వారికి తమ తమ్ముడి పైన కలిగిన సద్భావమంతా పోయింది. ముగ్గురూ కలిసి మాట్లాడు కుంటున్నప్పుడు పెద్దవాళ్ళిద్దరూ అకారణంగా మహత్సేనుడితో నిష్ఠురాలాడ నారంభించి, అతన్ని కాస్తా చంపేశారు.

ఈ దుర్వార్తను మహత్సేనుడి పరివారం మాహిష్మతీనగరానికి చేరవేశారు. ద్యుమత్సేన మహరాజుకు దుర్భరమైన శోకంతో బాటు దుస్సహమైన క్రోధం కూడా కలిగింది. ఆయన అప్పటికప్పుడే సైన్యాన్ని ఆయత్తం చేసి తన పెద్దకొడుకు లిద్దరి పైకి యుద్ధానికి బయలుదేరాడు.

చిత్రసేన, విచిత్రసేనులకు ఇదీ తమ మంచికే వచ్చిందనిపించింది. ఎందుచేతనంటే వాళ్ళు తమ తమ్ముణ్ణయితే చంపారు గాని, అతని రాజ్యాన్ని ఆక్రమించటానికి ముసలిరాజొకడు అడ్డు ఉండనే ఉన్నాడు. ప్రజలు సహజంగా ఆయన పక్షానే ఉంటారు. ఆయనే యుద్ధం ప్రకటించాడు గనక ఇప్పుడు తామిద్దరూ తమ రెట్టింపు సేనతో తండ్రిసేనను అవలీలగా ఓడించి, క్షత్రియధర్మానుసారం రాజ్యమంతా తీసుకోవచ్చు. ముసలివాడైన తమ తండ్రి తమను ఎలాగూ ఎదుర్కొలేడు.

అయితే వారనుకున్నట్టు జరగలేదు. యుద్ధంలో వారి సేనలు ఏ విధమైన ప్రతాపమూ చూపలేదు. ముసలివాడై కూడా ద్యుమత్సేనుడు వీరవిహారం చేసి, యుద్ధంలో మొదటి నుంచీ తనదే పైచేయి అనిపించాడు. చివరకు చిత్రసేన, విచిత్రసేనులు అతిసామాన్య యోధుల చేతిలో చచ్చారు.

తరవాత ద్యుమత్సేన మహారాజు మాహిష్మతీ పురానికి తిరిగివెళ్ళి, అయిదేళ్ళ

వయసు గల తన మనమడికి, మహత్సే నుడి కొడుక్కు, పట్టంగట్టి, వాడి తరఫున తానే రాజ్యపాలన చేశాడు. ఆయన తద నంతరం ఆ కుర్రవాడు నిషధ దేశాని కంతకూ రాజయి ప్రజానురంజకంగా రాజ్యపాలనచేశాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, ద్యుమ త్సేనుడి కొడుకులు ముగ్గురూ చావటానికి కారణ మెవరు? చిత్రసేన విచిత్రసేనులకు అన్యాయం జరిగిన మాట నిజమే కదా? వారికి యుద్ధంలో ఓటమి ఎందుకు సంప్రాప్త మయింది? ఈ ప్రశ్నలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ద్యుమత్సే నుడు తన పెద్దకొడుకులకు ఎలాటి అన్యా యమూ చేయలేదు. వాళ్ళు రాజ్యార్హులు కారని తెలిసి కూడా వాళ్ళకు రాజ్యంలో భాగా లిచ్చాడు. తమకు రాజ్యార్హత ఏ మాత్రమూ లేదని వారు నిరూపించు కున్నారు. తమ ప్రజలు తమ తమ్ముణ్ణి మహారాజు లాగా చూసినప్పుడు వారు తమ అల్పత్వాన్ని గ్రహించి ఉండవచ్చు. వారు అలా చేయక అతన్ని అసూయతో చంపి, తమ ప్రజలకు తమ పై మరింత అసహ్యం పుట్టేటట్టు చేసుకున్నారు. తమ తండ్రి బతికి ఉన్నంత కాలమూ తమ సైని కులకు ఆయన మహారాజే నన్న సత్యం కూడా వారు గ్రహించక, తమ తండ్రితో యుద్ధానికి తలపడ్డారు. మహారాజు పై కత్తి కట్టినవాళ్ళు ఆ మహారాజు ప్రజలదృష్టిలో రాజద్రోహులు. అందుకే వారి సేనలు సరిగా యుద్ధం చెయ్యలేదు. వాళ్ళు సాధారణ యోధుల చేతిలో చావటానికి కూడా అదే కారణం," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)



# మూడు వస్తువులు

స్వర్ణనగరరాజ్యానికి పూర్ణచంద్రు డనేవాడు చిన్నతనంలోనే రాజయాడు. అతనికి తల్లీ, భార్యా, పెళ్ళిగాని చెల్లెలూ ఉన్నారు. ఆ ముగ్గురి పైనా అతనికి చాలా ప్రేమ.

ఒకనాడు అతని వద్దకు ఒక యోగి వచ్చి, ఒక గుళికా, ఒక హారమూ, ఒక పుష్పమూ ఇచ్చి, "వీటిని నీ పై ప్రేమగలవారికి ఇయ్యి. ఈ గుళిక మింగినవారికి ఏ విచారాలూ కలగవు; వాళ్ళు క్షేమంగా వుంటారు. ఈ హారాన్ని ధరించినవారి వల్ల నీకు చాలా మంచి కలుగుతుంది. ఈ పువ్వు తలలో పెట్టుకున్నవారి అందం రెండింత లవుతుంది," అని చెప్పి వెళ్ళిపోయాడు.

తనకు ప్రేమపాత్రులు ముగ్గురున్నారు. కానుకలు మూడున్నాయి. అందులో ఒక్కటీ తనకు కాదు. దేన్ని ఎవరి కివ్వాలో రాజుకు తెలియలేదు. ఒకవంక, యోగి తన కేమీ ఇవ్వలేదన్న బాధ కూడా ఉన్నది.

అంతలోనే అతనికి ఒక సంగతి తట్టింది. అదేమిటంటే, యోగి తనకని ఏమీ ఇవ్వకపోయినా, ఆ ఇచ్చిన మూడు వస్తువులూ తనకు మేలు చెయ్యాలనే ఇచ్చాడు. ఈ మాట తట్టగానే అతను గుళికను తన తల్లికీ, హారాన్ని భార్యకూ, పుష్పాన్ని చెల్లెలికి ఇచ్చాడు. తన తల్లి వితంతువు; ఆమె చీకూ, చింతా లేకుండానూ, క్షేమంగానూ ఉంటే తన బాధ్యత తగ్గిపోతుంది. తన భార్య వల్ల తనకు జీవితాంతం మంచే కలిగినట్టయితే తన దాంపత్య జీవితం సుఖంగా వెళ్ళిపోతుంది. తన చెల్లెలి అందం రెట్టింపయితే ఆమెకు మంచి సంబంధం తేలికగా దొరుకుతుంది. అందుచేత రాజు ఆ కానుకలను వారికి ఇచ్చేశాడు.






# అచ్చిరాని దేశాటన

పూర్వం పర్షియాదేశంలోని ఒక గ్రామంలో ఒక పేదవాడికి మల్లయుద్ధ ప్రవీణుడైన కొడుకుండేవాడు. ఆ యువకుడు పేదరికంతో విసుగుచెంది, దేశాటన చేసి ధనం సంపాదించాలనుకున్నాడు. అందు కతను తండ్రి అనుమతి కోరాడు.

తండ్రి తన కొడుకును చూసి జాలిపడి, "నాయనా, బాహుబలం కంటె అదృష్ట బలం గొప్పది. ఉన్నదానితో తృప్తిపడటం మంచిది," అన్నాడు.

అందుకు కొడుకు, "యాత్రల వల్ల ఎన్నో లాభాలుంటాయి. ప్రపంచంలోని వింతలు చూడవచ్చు. కొత్తవారి స్నేహమూ, పరిచయమూ సంపాదించవచ్చు. ధనం సంపాదించవచ్చు. ఎంతో లోకజ్ఞానం కూడా లభిస్తుంది," అన్నాడు.

"యాత్రల వల్ల లాభం పొందగలవారు వర్తకులూ, పండితులూ, గాయకులూ, ఒళ్ళువంచి పనిచెయ్యగలవారూనూ. వారు ఎక్కడైనా చలామణీ అవుతారు. నీవంటి వారికి యాత్రలు లాభించవు. దేశంకాని దేశంలో నిన్ను గురించి విచారించేవారుండరు. కాబట్టి నీ ఉద్దేశం మార్చుకో," అన్నాడు తండ్రి.

"నిప్పులో వేస్తేగాని అగరు వాసన తెలీదు. నేను మదపుటేనుగునూ, సింహాన్నీ కూడా ఎదిరించగల బలశాలిని. నా అదృష్టం ఎక్కడున్నదీ వెతుకుతాను," అన్నాడు కొడుకు.

తండ్రి సరేనని, కొడుకును ఆశీర్వదించి పంపేశాడు.

కొడుకు కాలినడకన బయలుదేరి కొన్నాళ్ళకు సముద్రతీరం చేరాడు. అక్కడ పడవ ఒకటి సముద్రం మీద బయలుదేరటానికి సిద్ధంగా ఉన్నది. యువకుడి దగ్గిర పైసాకూడా లేదు. అతడు ఆ సంగతి

షేక్ అబ్దుల్ వహాబ్



చెప్పి, తనను పడవ ఎక్కించుకోమని పడవవాణ్ణి బతిమిలాడాడు.

"చూడటానికి ఏనుగులాగున్నావు, దయా ధర్మం అడగటానికి నీకు సిగ్గులేదూ?" అని పడవవాడు యువకుణ్ణి తిట్టి, కేవు ఇవ్వందే పడవలోకి ఎక్కనివ్వనన్నాడు.

యువకుడికి పట్టరాని కోపం వచ్చింది. ఇంతలో పడవ రేవు నుంచి కదిలింది. అప్పుడు యువకుడు చేతులెత్తి అరుస్తూ, కేవుకు బదులు తన చొక్కా ఇస్తానన్నాడు.

చొక్కా మీద ఆశపుట్టి పడవవాడు పడవను ఒడ్డుకు పట్టించాడు. పడవవాడు ఒడ్డుకు దిగగానే యువకుడు వాడి మెడ పట్టుకుని ఒక్క చావుదెబ్బతో పడగొట్టాడు. ఇది చూసి మరొక పడవవాడు మొదటి వాడికి సాయంవస్తే వాణ్ణి కూడా అతను చావదన్నాడు.

అంత బలశాలితో వైరం మంచిదికాదని మొదటి పడవవాడు యువకుడికి క్షమాపణ చెప్పుకుని, కేవు లేకుండానే అతన్ని తన పడవలోకి ఎక్కించుకున్నాడు. పడవ కదిలింది.

కొంతదూరం పోయాక సముద్ర మధ్యంలో ఒక స్తంభం కనిపించింది. పడవను దాని సమీపంగా తీసుకుపోయి పడవవాడు, "పెద్ద ప్రమాదం వచ్చిపడింది. ముందు సుడిగుండం ఒకటి ఏర్పడింది. ఎవరన్నా బలంగలవాడు ఒక మోకు తీసుకుని ఈదుతూ వెళ్ళి, పడవను ఆ స్తంభానికి కట్టాలి. లేకపోతే పడవ సుడిగుండంలో మునిగిపోతుంది," అన్నాడు.

యువకుడు మోకు తీసుకుని స్తంభం వద్దకు ఈదుకుంటూ వెళ్ళాడు. పడవవాడు మోకును లాగేసుకుని పడవను నడిపించుకుంటూ వెళ్ళిపోయాడు. యువకుడు నడిసముద్రంలో స్తంభంమీద ఉండిపోయాడు. ఒకసారి అవమానం పొందిన వ్యక్తి, వెయ్యిసార్లు సంతోషపెట్టినా, తన ప్రతీకార

వాంఛను వదులుకోడు. ఈ మాట యువకుడికి గుర్తు లేకపోయింది.

రెండు రోజులు ఆ యువకుడు ఆ స్తంభం మీదే ఉండి, మరో పడవ ఏదన్నా అటుగా వస్తుందేమోనని నిరీక్షించాడు. కాని రాలేదు. తరవాత అతను పట్టుతప్పి నీటిలో పడిపోయాడు. ఒక రోజంతా నీటిలో ఈదగా అతనికి ఒడ్డు చిక్కింది.

అకలి దహించుకుపోతున్నది. పక్కనే ఒక తోపు కనిపించింది. అందులో ప్రవేశించి, ఆకులూ, కాయలూ, దుంపలూ అవు రావురని తిన్నాక అతని ప్రాణం కాస్త కుదటపడింది. కాని దాహం బాధిస్తున్నది. నడిచేటందుకు శక్తి వచ్చింది. కొంతదూరం నడిచేసరికి యాత్రికుల బృందం ఒకటి కనిపించింది. వాళ్ళున్నచోట ఒక బావి కూడా ఉన్నది. ఆ బావి గల మనిషి యాత్రికులకు డబ్బుతీసుకుని నీరిస్తున్నాడు. వాడొక ఏనుగుగున్నలాగా, పొట్టిగా ఉన్నాడు.

యువకుడు వాణ్ణి మంచి నీళ్ళడిగాడు. పొట్టివాడు ఇవ్వనన్నాడు. యువకుడికి నాలుక పిడచగట్టుకుపోయి మాట కూడా సరిగా రావటంలేదు. అతను ఆ పొట్టివాణ్ణి దూరంగా విసిరేసి, కుండలో నీళ్ళు గడగడా తాగేశాడు. ప్రాణం లేచివచ్చింది.




పొట్టివాడూ, కొందరు యాత్రికులూ తన మీద పడాలని చూస్తే ఎలాగో తప్పించుకుని, ఎడారి దారిపట్టాడు.

యువకుడు కొంతదూరం పోయేసరికి చీకటి పడింది. ఎక్కడా జనసంచారాలు కనిపించలేదు. అతను నడకసాగించాడు. అతను గాఢాంధకారంలో పడి పోతూ ఉంటే దూరంగా దీపంకాంతి కనబడింది. అది ఒక వర్తకుల బిడారు.

వర్తకులు దొంగల భయంతో ప్రాణాలు అరచేతపట్టుకుని ఉన్నారు. ఆ సంగతి తెలిసి యువకుడు వారితో, "మీరేమీ భయపడకండి. నేనొక్కణ్ణే యాభైమందికి జవాబు

చెప్పగలను. నేనుండగా మిమల్ని ఎవరూ ఏమీ చెయ్యలేరు," అన్నాడు.

ఆ మాటకు వర్తకులు సంతోషించి, అతనికి ఆహారపానీయాలు ఇచ్చారు. యువకుడు తృప్తిగా తిని, నీరు తాగి, నిద్ర ముంచుకురాగా, గురకపెట్టి నిద్రపోసాగాడు.

అప్పుడు వర్తకులలో ఒకడు మిగిలిన వాళ్ళతో, "సోదరులారా, దొంగల భయం కంటె ఈ యువకుడి భయమే జాస్తిగా ఉండేటట్టు కనబడుతుంది. ఇతను దొంగ కాడని మనకేం తెలుసు? నిజం దేవుడికే తెలియాలి. ఇతన్ని ఇక్కడే వదిలి మనం వెళ్ళిపోవటం మేలు," అన్నాడు. మిగిలిన వర్తకులలో కూడా సందేహం తలఎత్తింది. వాళ్ళు అతన్ని అక్కడే వదిలి ముందుకు సాగిపోయారు.

యువకుడికి మెలకువ వచ్చేసరికి తెల్లవారవస్తున్నది. వర్తకుల బిడారు లేదు. "ఆహా, తండ్రి చెప్పిన మాట నిజమయింది గదా," అనుకున్నాడు. అంతలో దూరాన కత్తులు టకటక మనటం వినిపించింది. యువకుడు అటుగా వెళ్ళేసరికి, ఒక అందమైన యువకుడు అనేకమంది దొంగలతో హోరాహోరి పోరాడుతున్నాడు. మన యువకుడు కూడా దొంగల మీదికి కలియబడ్డాడు. ఇద్దరు యువకుల ధాటికి తట్టుకోలేక దొంగలు పారిపోయారు.

అందమైన యువకుడు మన యువకుడితో, "సోదరా, నువ్వెవరో నాకు తెలీదు. సమయానికి నువు రాకపోతే ఈనాడు నా ప్రాణాలు నిలిచేవికావు. నే నీ దేశపు యువరాజును. నాకు చేసిన సహాయానికి నా ఆతిథ్యం స్వీకరించమని కోరుకొంటున్నాను," అన్నాడు.

మన యువకుడు యువరాజుకు తన కథ అంతా చెప్పుకున్నాడు. యువరాజు అతన్ని కొంత కాలం తన వద్ద ఉంచుకుని, అనేక కానుకలిచ్చి ఇంటికి పంపేశాడు.





# జోస్యగాడు

పర్షియాదేశంలో ఒక పేదవాడుండేవాడు. అతను నగరంలోని వీధుల వెంట తిరిగి చిల్లర వ్యాపారం చేసుకుని జీవితం నెట్టు కొస్తూ ఉండేవాడు.

ఒకనాడు ఈ పేదవాడి భార్య స్నానాని కని స్నానశాలకు వెళ్ళింది. అదే సమ యంలో అక్కడికి మరొక స్త్రీ వచ్చి, తాను స్నానం చెయ్యాలనీ, తన కోసం స్నాన శాలను ఖాళీ చేయమనీ స్నానశాలవాణ్ణి అడిగింది. వాడు మిగతా స్త్రీలందరినీ బయ టికి వెళ్ళమన్నాడు.

ఈ ఉత్తరువు విని పేదవాడి భార్యకు రోషం వచ్చి, "ఎవరీ మహారాణి? ఈమె కోసం మమ్మల్నందరినీ బయటికి తరిమే స్తున్నావు!" అని అడిగింది.

స్నానశాలవాడు, "ఆవిడ ఎవరను కున్నావు? రాజుగారి ప్రధాన జ్యోతిష్కుడి భార్య!" అన్నాడు.

పేదవాడి భార్య చిరాకుతో ఇంటికి తిరిగి వచ్చి, తన భర్తతో, "నువు బొత్తిగా ఊరూ పేరూ లేనివాడివై పోయావేమిటి? జ్యోతి ష్కుడివన్నా కారాదా? నన్ను నలుగురూ కాస్త మర్యాదగా చూస్తారు," అన్నది.

"నేను జాతకచక్రాలు వెయ్యలేను, గ్రహచారాలు గుణించలేను, జ్యోతిష్కుడు కావటం నావల్ల అవుతుందా?" అన్నాడు పేదవాడు.

"నా కదంతా తెలీదు. నువు జ్యోతి ష్కుడివి కాకపోయావో, మన పెళ్ళి రద్దు చేసి నా దారిన నేను పుట్టింటికి వెళ్ళి పోతాను," అన్నది భార్య.

పేదవాడు చేసేదిలేక ఒక పంచాంగం కట్టా, పాచికలూ తీసుకుని స్నానశాల వెల పల జోస్యం చెప్పటానికి కూర్చున్నాడు.

ఇదేసమయంలో రాజకుమార్తె స్నాన శాలలో స్నానం చేస్తున్నది. ఆమె స్నానం

పర్షియా జానపద కథ




ప్రారంభించబోతూ తన చేతి ఉంగరం తీసి దాసీదాని కిచ్చి, "దీన్ని భద్రంగా వుంచు. స్నానం అయాక తీసుకుంటాను," అని చెప్పింది.

ఆ ఉంగరాన్ని ఎక్కడ ఉంచటానికీ పాలుపోక, దాసీది చలువరాతి గోడల్లో ఒక చిన్న రంధ్రం ఉంటే, అందులో ఉంగరాన్ని దూర్చి, గుర్తుగా ఒక వెంట్రుకల తుట్టె ఆ రంధ్రంలో గుచ్చింది.

కాని రాజకుమార్తె స్నానం ముగించి, "ఏదే నా ఉంగరం?" అని అడిగేసరికి దాసీదానికి, తానా ఉంగరం ఎక్కడ భద్రం చేసినదీ చచ్చినా జ్ఞాపకం రాలేదు.

దాని కంగారు చూసి రాజకుమార్తె, "ఆ ఉంగరం ఈ క్షణం ఇవ్వక పోయావో నీ ప్రాణాలు తీస్తాను," అంటూ మీదికి వచ్చింది.

దాసీది భయపడి స్నానశాల వెలపలకు పరిగెత్తుకువచ్చింది. దానికి జ్యోతిష్కుడు కనిపించాడు.

"బాబ్బాబు! రాజకుమార్తె ఉంగరం ఎక్కడుందో కాస్త చెప్పు. లేకపోతే నా ప్రాణాలు దక్కవు," అన్నది దాసీది పేదవాడితో.

పేదవాడికి ఏం చెయ్యాలో ఏమనాలో తెలియలేదు. అతను దాసీ కేసి చూశాడు, పంచాంగం తిప్పాడు, పాచికలు వేసి వాటిని పరీక్షగా చూశాడు.

దాసీది నెత్తిమీదిగా వేసుకున్న బట్టలో ఒక చిరుగున్నది. దానిలో నుంచి వెంట్రుకలు బయటికి చూస్తున్నాయి. ఇది గమనించిన పేదవాడు, ఏదయితే అదవుతుందనుకుని, "అమ్మాయీ, నాకొక చిన్నకంత కనిపిస్తున్నది. అందులో వెంట్రుకలు కనబడుతున్నాయి!" అన్నాడు.

వెంటనే దాసీకి తాను ఉంగరం దాచిన స్థలం గుర్తుకొచ్చింది. ఆమె గబగబా స్నానశాలలోకి పరెగెత్తుకుపోయి, ఉంగరాన్ని తీసి

రాజకుమార్తెకిస్తూ, బయట ఉన్న జ్యోతిష్కుడు ఇవాళ తన పరువు దక్కించాడని చెప్పింది.

రాజకుమార్తె అది చెప్పిన మాటలకు అబ్బురపడి, ఇంటికివెళ్ళి తన తండ్రికి ఈ సంఘటన అంతా చెప్పింది.

రాజుగారు ఈ కొత్త జ్యోతిష్కుణ్ణి రావించి, దుశ్శాలువలు కప్పి, తన ఆస్థానంలో కొలువిచ్చాడు.

కాని త్వరలోనే జ్యోతిష్కుడికి అగ్నిపరీక్ష తగిలింది. ఎవరో దొంగలు ఖజానాలో చోరీ చేశారు. అమూల్యమైన వస్తువులు పోయాయి. దొంగలెవరో జోస్యం చెప్పమని రాజుగారు కొత్త జ్యోతిష్కుణ్ణి ఆజ్ఞాపించాడు.

జ్యోతిష్కుడికి మతి పోయినట్టయింది. ఎందుకైనా మంచిదని అతను రాజుగారిని నలభైరోజులు గడువడిగాడు. అందుకు రాజు సరేనన్నాడు.

జ్యోతిష్కుడు ఇంటికొచ్చి తన భార్యతో, "అంతా అయిపోయింది. జ్యోతిష్కుడు కమ్మని నా ప్రాణాలు తీశావు. రాజుగారి ఖజానాలో చోరీ జరిగింది. దొంగలను కనుక్కోవటానికి నలభైరోజులు గడువడిగాను. గడువు తీరేరోజున మనం పారిపోవటం తప్ప మార్గంలేదు," అన్నాడు.






లెక్క తెలియగలందులకు జ్యోతిష్కుడి భార్య నలభై ఖర్జూరాలను ఎంచి ఒక జాడీలో వేసి, "ప్రతి సాయంకాలమూ ఒక్కొక్క ఖర్జూరం తినటానికి ఇస్తాను. జాడీ ఖాళీ అయిన రాత్రి పారిపోదాం," అని చెప్పింది.

రాజుగారి ఖజానా దోచిన దొంగల జట్టులో సరిగా నలభైమందే ఉన్నారు. జ్యోతిష్కుడు తమను పట్టి ఇవ్వటానికి నియోగించబడ్డట్టు వాళ్ళకు తెలిసింది. ఆ సాయంకాలం చీకటిపడేవేళకు దొంగలు తమలో ఒకణ్ణి జ్యోతిష్కుడి ఇంటికి పంపి, లోపల జరిగే సంభాషణ విని రమ్మన్నారు.

దొంగ చాటున పొంచి వింటుండగా జ్యోతిష్కుడి భార్య జాడీ తెచ్చి, "ఒకటీ," అంటూ తన భర్తకు ఒక ఖర్జూరం ఇచ్చింది.

"మిగిలినవి ముప్పైతొమ్మిదీ!" అన్నాడు జ్యోతిష్కుడు.

దొంగ గాభరాపడుతూ వెళ్ళి మిగిలిన దొంగలతో, "జ్యోతిష్కుడు మన రహస్యం కనిపెట్టేశాడు. నేను చాటున ఉన్నా కూడా ఆయన నన్ను తెలుసుకుని, 'ఒకటీ—మిగిలినవి ముప్పైతొమ్మిదీ!' అన్నాడు," అని చెప్పాడు.

వాడిమాట మిగిలినవాళ్ళు నమ్మక మర్నాడు చీకటిపడేవేళ ఇంకో దొంగను జ్యోతిష్కుడింటికి పంపారు. లోపల జ్యోతిష్కుడు, "రెండూ! ఇంకా ఉన్నవి ముప్పయ్యెనిమిదీ!" అనటం వాడికి వినబడింది.

ఇలా ముప్పైతొమ్మిది రోజులపాటు ముప్పైతొమ్మిదిమంది దొంగలూ లెక్క విన్నారు. వాళ్ళకిక ఎలాటి అనుమానమూ మిగలలేదు. జ్యోతిష్కుడికి తమ ఆచోకీ తెలిసిందనేవాళ్ళు అనుకున్నారు.

నలభయ్యోరోజు దొంగలనాయకుడే వచ్చి పొంచి విన్నాడు.

లోపల జ్యోతిష్కుడికి ఆఖరు ఖర్జూరం ఇస్తూ, "ఇదే ఆఖరుది! చూశావా? ఇది లోగడ వాటన్నిటికన్నా చాలా పెద్దది!" అన్నది భార్య.

దొంగల నాయకుడికి కాళ్ళు చల్ల బడ్డాయి. వాడు చప్పున లోపలికి వచ్చి, జ్యోతిష్కుడి కాళ్ళపైన పడి, "మమ్మల్ని రాజుగారికి పట్టివ్వకండి, బాబోయ్! దొంగి లించిన సొమ్మంతా ఇచ్చేస్తాను. మీకు బహుమానం కూడా ఇచ్చేస్తాను. మా రహస్యం మటుకు రాజుగారికి చెప్పొద్దు! మా పీకలు తెగిపోతాయి!" అని మొత్తుకున్నాడు.

"అలాగే కానీ!" అన్నాడు జ్యోతి ష్కుడు తొణక్కుండా.

ఆ రాత్రే దొంగలు తాము ఖజానా నుంచి దోచినదంతా తెచ్చి జ్యోతిష్కుడికి ఇచ్చి, లంచంగా బోలెడంత డబ్బు కూడా ఇచ్చుకున్నారు.

జ్యోతిష్కుడికి పోయిన ప్రాణం తిరిగి వచ్చినట్టయింది. ఆయన మర్నాడు రాజు గారికి పోయిన సొమ్మంతా అప్పగించాడు. తన ఆస్థాన జ్యోతిష్కుడి సామర్థ్యానికి దిగ్భ్రమచెంది రాజుగారు అతనికి గొప్పగా సత్కారాలు చేశాడు.




రాజుగారు తనను మెచ్చుకుని సత్కా రాలు చేస్తున్నకొద్దీ జ్యోతిష్కుడికి ఆరాటం జాస్తి కాసాగింది. ఇలా ఎంతకాలం జరుగు తుంది? ఎప్పుడో తాను దొరికిపోక తప్పదు. ఆనాడు రాజు తన తల తీయించకా మానడు. ఇంతవరకూ అదృష్టం తనను నెట్టుకొచ్చింది. కాని అదృష్టదేవత చాలా చంచలమైనది.

ఈ బెడద నుంచి బయటపడట మెలాగా అని జ్యోతిష్కుడు ఆలోచిస్తూ స్నానం చేస్తూండగా అతని కొక గొప్ప ఆలోచన తట్టింది. తనకు పిచ్చి ఎత్తిందని తోస్తే, రాజు తనను కొలువు నుంచి తీసేస్తాడు.

ఆ తరవాత తనకు మెడ మీద కత్తిలాగా ఈ సమస్య ఉండదు.

ఈ ఆలోచన తట్టినదే తడవుగా జ్యోతిష్కుడు తడిగుడ్డలతోనే రాజభవనానికి పరిగెత్తాడు. తిన్నగా రాజుగారు అభ్యంతర సభ తీరి ఉన్నచోటికి వెళ్ళి, రాజుగారిని ఆసనం మీది నుంచి ఎత్తుకుని బయటికి పరుగుతీశాడు.

ఆ మరుక్షణమే పైనున్న దూలం విరిగి రాజుగారు కూర్చుండిన ఆసనం మీద డభీమంటూ పడింది. ఆసనం పూర్తిగా ధ్వంసమయింది.

తన ఆస్థాన జ్యోతిష్కుడి అసభ్య ప్రవర్తనకు ఆగ్రహావేశం తెచ్చుకుంటున్న రాజు ఇది చూడగానే, "ఆహా! నువు సామాన్య జ్యోతిష్కుడివి కావు, త్రికాల వేదివి! నాకు రానున్న కీడు ముందే గ్రహించి, నా ప్రాణం కాపాడటానికి స్నానం చేస్తూ, చేస్తూ వచ్చావు! నీబోటి అప్తుడు మరెవడుంటాడు! ఏమిస్తే నీ రుణం తీరుతుంది!" అన్నాడు.

రాజుగారితో రహస్యాలోచనలు చేస్తూ ఉండిన మంత్రులందరూ జ్యోతిష్కుడి పాదాల మీద పడ్డారు.

రాజుగారు జ్యోతిష్కుడికి గొప్ప సన్మానం చేసి, అంతులేని బహుమానా లిచ్చి, పాత ప్రధాన జ్యోతిష్కుణ్ణి ఆ పదవి నుంచి తొలగించి అతని స్థానంలో ఈ జ్యోతిష్కుణ్ణి నియమించాడు.

మర్నాడు జ్యోతిష్కుడి భార్య స్నానశాలకు వెళ్ళింది. ఆ సమయంలో అక్కడ పాత ప్రధాన జ్యోతిష్కుడి భార్య స్నానం చేస్తున్నది.

జ్యోతిష్కుడి భార్య స్నానశాలవాడితో, "ఆ మనిషిని పంపించు. నేను స్నానం చెయ్యాలి!" అన్నది.

"చిత్తం, చిత్తం!" అన్నాడు స్నానశాలవాడు.





# దురాశ దుఃఖం చేటు

చాలాకాలం క్రితం ఒక గ్రామంలో రంగయ్య అనే వైద్యుడొకడు ఉండేవాడు. వైద్యంలో ఘటికుడేగాని, పట్టి దురాశా పరుడు. వైద్యంకోసం వచ్చినవారిని, బీదా సాదా అని చూడకుండా, పీల్చి పిప్పి చేసేవాడు. ఊరివాళ్ళకు అతని వద్దకు వెళ్ళాలంటే గుండెలు దడదడలాడేవి. కాని గత్యంతరం లేదు. చుట్టూ అయిదారా మడల్లో సరి అయిన వైద్యుడు ఒకడూ లేడు. పూర్వం ఆ గ్రామంలో వున్న వైద్యులు రంగయ్య తాకిడికి తట్టుకోలేక దూర గ్రామాలకు పారిపోయారు.

ప్రజలను పీడించి రెండు చేతులా డబ్బు సంపాదిస్తున్నా రంగయ్యకు తనివి తీర లేదు. పైపెచ్చు, డబ్బు కూడినకొద్దీ ఆశ ఎక్కువ కాసాగింది. చుట్టుపట్ల ఎక్కడా తనను మించిన ధనవంతుడు లేడనిపించుకోవాలని అతని ఆశ.

ఆ ఊళ్ళోనే రామనాథం అనే ధనవంతుడు ఒకడుండేవాడు. అతను దయాదాక్షిణ్యాలు కలవాడు. ఊళ్ళో ఎవరికే ఆపద సంభవించినా తన శక్తికొద్దీ ఆదుకునేవాడు. రామనాథం అంటే ఊళ్ళో అందరికీ ప్రేమా, గౌరవమూను. కాని రంగయ్యకు మాత్రం అతనంటే మంట. అతని మూలానే తనకు గౌరవ మర్యాదలు లేకుండా పోతున్నాయని రంగయ్య ఉద్దేశం. ఎన్ని కుతంత్రాలు పన్ని కూడా రంగయ్యకు రామనాథాన్ని అణచివెయ్యటం సాధ్యంకాలేదు.

అయితే ఒకనాడు రంగయ్యకు ఆ అవకాశం దొరికింది. రామనాథానికి గల ఒక్కగా నొక్క కొడుక్కు అకస్మాత్తుగా జబ్బు చేసింది. బిడ్డ చాలా బాధలో ఉన్నాడు. అది చూసి విలవిలలాడిపోతూ రామనాథం రంగయ్యను పిలిపించాడు.

యస్. జహర్

రంగయ్య వచ్చి బిడ్డను చూసి, "అయ్యా, ఇది రౌక్ష్యగుణం. విషవ్యాధి. చికిత్స చెయ్యాలంటే శ్రమతోనూ, ఖర్చు తోనూ కూడిన పని," అన్నాడు.

రామనాథం రంగయ్య చేతులు పట్టుకుని, "రంగయ్యగారూ, నాకున్న సంతానం వీడొక్కడే. ఎంత శ్రమ అయినా సరే మీరీ బిడ్డను బతికించాలి. మీ ఋణం ఉంచుకోను," అన్నాడు.

రంగయ్య సానుభూతి నటిస్తూ, "అయ్యా, తమ సంగతి నే నెరగనా? తమ కోసం ఎంత శ్రమ అయినా పడతాను. కాని ఈ చికిత్సకు మహాఘృతం, అంటే నూటపదకొండు సంవత్సరాలనాటి నెయ్యి కావాలి. లేదా, స్వర్ణశ్యామకం తయారు చేయాలి. అందుకు మణుగు బంగారం కావాలి," అన్నాడు.

రామనాథం గుండెల్లో రాయి పడింది. రంగయ్య దుర్బుద్ధి స్పష్టమవుతూనే ఉన్నది.

"నా ఆస్తంతా అమ్మినా మణుగు బంగారం కాదే! మీరే ఏదయినా దారి చూడండి, పుణ్యం ఉంటుంది," అన్నాడు రామనాథం.

"ఈ రోగానికి మరో చికిత్స లేదు. ఆ తరవాత మీ యిష్టం. ఆస్తే చూసుకుం



టారో, మీ బిడ్డ ప్రాణమే చూసుకుంటారో మీరే నిర్ణయించుకోండి," అన్నాడు రంగయ్య నిర్దయగా.

రంగయ్యను బతిమాలి లాభం లేదు. అతనిది కసాయిగుండె. దైవం మీద భారం వేసి, మణుగు బంగారం తెచ్చి ఇవ్వడానికి ఒప్పుకున్నాడు రామనాథం.

రామనాథం ఆస్తంతా హారతికర్పూరంలా ఇగిరిపోయింది. రంగయ్య నాలుగు రోజులు రాత్రింబగళ్ళు కష్టపడ్డట్టే కనిపించింది. పిల్లవాడు మాత్రం బాగా కోలుకుని తిరగగలిగాడు.



రంగయ్య తనకు చేసిన ద్రోహం తలుచుకుని రామనాథం కడుపు మండిపోసాగింది. ఎలాగైనా ఇందుకు ప్రతీకారం చేసి రంగయ్య కళ్ళు తెరవాలనిపించింది. లేకపోతే రంగయ్య దురాశ ఇంకెన్ని కొంపలైనా ముంచవచ్చు.

రామనాథం తన భార్యనూ, కుమారుణ్ణీ తీసుకుని ఊరు విడిచి ఎటో వెళ్ళిపోయాడు.

రామనాథం రంగయ్యమీద పగబట్టాడనీ, ఏదో ఒకరోజు రంగయ్య ఇల్లు కొల్లగొట్టబోతున్నాడనీ ఊళ్ళో పుకారు లేచింది. ఈ పుకారును లేవదీసినవాడు రామనాథానికి నమ్మకస్తుడైన ఒక రైతు.

పుకారు విని రంగయ్య బెంబేలు పడిపోయాడు. అసలే కుగ్రామం. తన హితవు కోరే మిత్రులు గ్రామంలో ఎవరూ లేరు. ఒక రాత్రంతా ఆలోచించి రంగయ్య ఒక నిర్ణయానికి వచ్చాడు—తన దగ్గిర ఉన్న బంగారమూ, ధనమూ పట్నానికి తీసుకుపోయి, ప్రభుత్వ ఖజానాలో దాచిపెట్టాలని.

తనకు బాగా తెలిసిన ఇద్దరు పాలెగాళ్లను పిలుచుకుని, తన బంగారమూ, ధనమూ మూటగట్టుకుని, రంగయ్య ఉదయాన్నే పట్నం బయలుదేరాడు.

కొండమలుపు తిరగగానే రంగయ్యను దొంగలు అటకాయించారు. రంగయ్యకు

గుండె జారిపోయింది. ఎదిరించటానికి కూడా వీలులేని పరిస్థితి. దొంగలు ఇరవై మంది దాకా ఉన్నారు.

వాళ్ళు రంగయ్యను ఒక కొండగుహలో బంధించారు. కాని వాళ్ళు తన దగ్గిర ఉన్న బంగారాన్నీ, డబ్బునూ దోచుకోక పోవటం చూసి రంగయ్య ఆశ్చర్యపడ్డాడు. అతను గుహ బయట కాపలా ఉన్న దొంగను పిలిచి, "నా వద్ద కొద్దిగా డబ్బున్నది. దాన్ని పుచ్చుకుని నన్ను వదిలెయ్య రాదూ?" అని అడిగాడు.

"నాయకుడి అజ్ఞ లేదు," అన్నాడు దొంగ, పెడసరంగా.

"పోనీ, కూడూ నీరూ అయినా ఇస్తారా? లేక నన్ను మాడ్చి చంపేస్తారా?" అన్నాడు రంగయ్య.

"ధర ఇచ్చుకుంటే ఏది కావాలంటే అది తెచ్చిస్తాను," అన్నాడు దొంగ.

"ఎంత ఇవ్వాలి?" అని రంగయ్య అడిగాడు.

"కూటికి లక్ష, నీళ్ళకు యాభైవేల రూపాయలు," అన్నాడు దొంగ.

రంగయ్య అదిరిపడ్డాడు. "లక్ష? ఇదేం కుట్ర! ఎంత దురన్యాయం! కూడుకు లక్ష రూపాయలా?" అని అతను కోపంతో పళ్ళు కొరికాడు.



"న్యాయమో, అన్యాయమో! దాని ధర అదీ. ఆ తరవాత మీ యిష్టం. డబ్బే కావాలో, కూడే కావాలో మీరే నిర్ణయించు కోండి," అన్నాడు దొంగ, నిర్లక్ష్యంగా.

రెండు రోజులపాటు రంగయ్య కూడూ, నీరూ లేకుండా గడిపాడు. రామనాథానికి ద్రోహం చేసినందుకు భగవంతుడు తనకు అలాటి శిక్ష కలిగించాడని అతనికి అనిపించింది. ఆకలి దహించుకుపోతున్నది. కళ్ళు బైర్లు కమ్ముతున్నాయి. తాను చచ్చినాక బంగారం ఎలాగూ దొంగలపాలే అవుతుంది. అంతకన్న ఇంత తిని తన ప్రాణాలు నిలుపుకోవటం మేలు.

దొంగను పిలిచి రంగయ్య తన అంగీ కారాన్ని తెలిపాడు.

రెండు వారాలైనా పూర్తికాకముందే రంగయ్య దగ్గిర ఉన్న బంగారమూ, డబ్బూ హరించుకుపోయింది. ఇక ఒక ముద్ద అన్నం కోసమూ, గుక్కెడు నీళ్ళ కోసమూ తాను వాచిపోయే స్థితి ఏర్పడిందని తెలుసుకుని, రంగయ్య కళ్ళ నీళ్ళు పెట్టుకున్నాడు.

అతను దొంగల నాయకుణ్ణి పిలిపించి, దణ్ణంపెట్టి, తిండి కోసం దీనంగా ప్రార్థించాడు.

"రామనాథం ఆస్తి హరించినప్పుడూ, గ్రామంలో ప్రజలను పీడించినప్పుడూ వాళ్ళు ఇలాగే బాధపడి ఉంటారని తెలుసుకోలేకపోయావా, రంగయ్యా?" అని దొంగల నాయకుడు అడిగాడు.

ఆ కంఠస్వరాన్ని గుర్తించి రంగయ్య, "నన్ను క్షమించు, రామనాథం. దురాశ కొద్దీ మిమ్మల్నందరినీ పీడించాను. ప్రాణం విలువ ఇప్పుడే నాకు తెలిసి వచ్చింది," అంటూ వలవల ఏడ్చాడు.

రామనాథం రంగయ్యను ఊరడించి గ్రామానికి తీసుకుపోయాడు. అటుతరవాత రంగయ్య ఊరికి ఎంతో ఉపకారి అయాడు.



# పందెం

**ఒ**కాసారి ఇద్దరు బ్రాహ్మణ బ్రహ్మచారులు పొరుగూరు వెళ్ళి పూటకూళ్ళ ఇంట భోజనం చేశారు. ఇద్దరి భోజనానికీ ఒకరే ఇచ్చుకునేటట్టు వాళ్ళు ఒక పందెం వేసుకున్నారు. అదేమిటంటే: ఒకరు రెండోవారిని ఒక ప్రశ్న వెయ్యాలి. రెండోవాడు సమాధానం చెప్ప లేకపోయినా, వాడు చెప్పలేని సమాధానాన్ని ప్రశ్న వేసినవాడు చెప్పినా, రెండోవాడు ఓడిపోయినట్టు. వాడు ఇద్దరి తిండిఖర్చూ ఇచ్చుకోవాలి.

ఒకడు రెండోవాణ్ణి ఇలా ప్రశ్న వేశాడు.

"ఆ కనిపించే పందికొక్కు కంత దగ్గిర మన్ను ఎందుకు లేదు?"

"నాకు తెలీదు. నువు చెప్పు," అన్నాడు రెండోవాడు.

"అది భూమిలోపల ఉండి కంత చేస్తూ బయటికి వచ్చింది. అందుచేత," అన్నాడు మొదటివాడు.

"అసలది భూమిలోపలికి ఎలా వెళ్ళింది?" అని అడిగాడు రెండోవాడు.

"అది నీ ప్రశ్న. సమాధానం కూడా నువే చెప్పు," అన్నాడు మొదటివాడు.

రెండోవాడు మారుమాటాడక ఇద్దరి డబ్బూ ఇచ్చుకున్నాడు.





# అన్నలూ - తమ్ముడూ

మగధదేశంలోని అరణ్యప్రాంతంలో చెంచు నాయకుడు ఒకడు ఉండేవాడు. అతనికి ముగ్గురు కొడుకులు పుట్టారు. వాళ్ళు యుక్తవయస్కులయే సమయానికి చెంచు నాయకుడికి, వార్ధక్యం ప్రవేశించే దశలో, మరొక కొడుకు కూడా పుట్టాడు. మొదటి కొడుకులు ముగ్గురూ స్ఫురద్రూపులు, వారిని చూసి చెంచు లనుకోవటం కష్టం. కాని నాలుగోవాడు నల్లగా, మూడు మూర్తులా చెంచు అని తెలిసేలాగే ఉండేవాడు. వాణ్ణి అందరూ కరిమిత్రుడని పిలిచేవాళ్ళు.

నాలుగోవాడు చాలా చురుకైనవాడు కావటంచేత తండ్రికి వాడంటే ఎక్కువ అపేక్షగా ఉండేది; తన అనంతరం కరిమిత్రుడే చెంచులకు నాయకుడు కావాలని కోరుకునేవాడు.

పెద్దవాళ్లు ముగ్గురూ, ఆటవిక జీవితంపై రోతపుట్టి, తమజాతి నుంచి తప్పుకుని వెళ్ళిపోయి, ఎక్కడన్నా నాగరికంగా బతకాలని నిశ్చయించుకున్నారు. సైనికులకు కావలసిన శక్తులు వారిలో ఉన్నాయి. అయితే ఒక చిక్కున్నది. వాళ్ళు చెంచులని తెలిస్తే నాగరికులు వాళ్లను దూరంగా ఉంచుతారు.

"మనం మాగధులమని చెప్పుకుందాం. మాగధీభాష మనకు వచ్చును గద. మన రంగు చూసి, ఆటవికులమని ఎవరూ అనుకోరు," అనుకున్నారు వాళ్ళు.

వాళ్ళు వెళ్ళిపోయి తమ మానాన బతుకుతామంటే వాళ్ళ తండ్రి అభ్యంతరం చెప్పలేదు; వాళ్ళకు తలా ఒక గుర్రమూ, కొద్దిగా డబ్బూ కూడా ఇచ్చాడు.

వాళ్ళు ఒక చోటి నుంచి మరొక చోటికి తిరుగుతూ చివరకు ఒక రాజ్యం చేరారు. సరిగ్గా అదే సమయానికి ఆ దేశపురాజు యుద్ధప్రయత్నాలు చేస్తూ, సైనికులను పోగు చేస్తున్నాడు. అన్నదమ్ములు ముగ్గురూ

సి. హనుమంతరావు



సైనికులుగా చేరతామన్నారు. ఆ రాజుకు ఏ దేశస్థులన్నా అభ్యంతరం లేదు గాని, ఆటవికులంటే ఒప్పుకోడు.

"మేము మాగధులం. రాజవంశం వాళ్ళం," అన్నారు వాళ్ళు.

ఈ విధంగా వాళ్ళు సైనికులుగా చేరి, యుద్ధంలో గొప్ప ప్రతాపం చూపారు. రాజు గారు వాళ్ళకు బహుమతు లిస్తూ, పెద్ద వాణ్ణి, "నువ్వు ఏ సంవత్సరంలో ఏ తిథిన పుట్టావు?" అని అడిగాడు.

తా నెప్పుడు పుట్టినదీ పెద్దవాడికి తెలీదు. అందుచేత తన నోటికి వచ్చిన సంవత్సరమూ, మాసమూ, తిథీ చెప్పేశాడు.

అది విని రాజు నిర్ఘాంతపోయి, "ఎంత ఆశ్చర్యం! నా పెద్దకుమార్తె సరిగా అదే రోజున పుట్టింది," అన్నాడు. యువకుడూ, మగధదేశపు రాజవంశీకుడూ, అందగాడూ అయిన ఆ వీరుడికి తన పెద్ద కూతురి నిచ్చి పెళ్ళి చెయ్యటం ఉచితంగానే ఉంటుందని రాజుకు తోచింది. అందుచేత ఆయన వారిద్దరికీ ప్రధానం చేస్తూ, గొప్ప విందు ఏర్పాటు చేశాడు.

ఆ విందులో పెద్దవాడికి మరొక వింత విషయం తెలియ వచ్చింది. తనకు యుక్త వయస్కులైన ఇద్దరు తమ్ములూ, మరీ చిన్నవాడైన ఇంకో తమ్ముడూ ఉన్నట్టే, రాజు కూతురికి కూడా పెళ్ళియీడు చెల్లెళ్ళు ఇద్దరూ, ఆరేళ్ళ పిల్ల మరొక చెల్లెలూ ఉన్నారు.

రాజుకు ఈ సంగతి తెలిసింది.

"ఆశ్చర్యం! మన కుటుంబాలు రెండింటికీ వియ్యం జరగాలని విధినిర్ణయం లాగా కనబడుతుంది. ముందు మీ ముగ్గురికీ నా పెద్దకూతుళ్ళను ముగ్గురినీ ఇచ్చి ఒకే సారి మూడు పెళ్ళిళ్ళూ చేసేస్తాను. తరవాత మీ బుల్లి తమ్ముణ్ణి తెచ్చి నా దగ్గిరే ఉంచుకుని, నా బుల్లి కూతురికి కాలక్రమాన పెళ్ళి చెయ్యవచ్చు," అన్నాడు రాజు.

మూడు పెళ్ళిళ్లూ యథావిధిగా జరిగాయి. కొంతకాలం గడిచినాక రాజు తన అల్లుళ్ళతో, "మీరు మీ దేశం వెళ్ళి, మీకు పెళ్ళిళ్ళు జరిగినట్టు మీ తల్లిదండ్రులకు చెప్పవలసిన అవసరం ఉన్నది గద. ఆ పని ముగించుకుని తిరిగి వచ్చేటప్పుడు మీ బుల్లి తమ్ముణ్ణి వెంటపెట్టుకుని రండి," అన్నాడు.

అన్నలు కలవరపడ్డారు. మిత్రుణ్ణి చూసిన క్షణమే వాడు చెంచువాడని రాజుగారు పోల్చుకుంటాడు. తాము కూడా చెంచులే నన్న సంగతి బయటపడి పోతుంది. అందుచేత వాళ్ళు ఎలాగైనా రాజుగారి ఆలోచనను పడగొట్టాలని చూశారు. కాని రాజు పట్టుబట్టి, "మీ తల్లిదండ్రులకు కానుకలు పంపటం నా విధి. మీరు వాటిని తీసుకుని వెళ్ళి తీరాలి," అన్నాడు.

వాళ్ళు ఇంటికి తిరిగి వచ్చి, తాము సైనికులుగా మంచి హొదాలు సంపాదించుకున్నామనీ, రాజకుమార్తెలను పెళ్ళాడామనీ చెబితే చెంచునాయకుడు చాలా సంతోషించాడు; కాని రాజుగారు తన చిన్న కొడుకును తీసుకు రమ్మన్నాడంటే చాలా విచారించాడు. మిత్రుడు తనకు దూరం కావటం ఆ వృద్ధుడికి ఏ మాత్రమూ ఇష్టం




లేదు. కాని వాడు రాజుగారి అల్లుడై గొప్పగా బతకటానికి ఎలా అభ్యంతరం చెప్పగలడు? మిత్రుడి ప్రయాణం స్థిరమయింది.

మిత్రుడికి కూడా బుల్లి రాజకుమార్తెను గురించి చాలా ఆసక్తిగా ఉన్నది. దారి వెంబడి వాడు తన అన్నలను అదేపనిగా ఆమెను గురించి ప్రశ్న లడుగుతూ వచ్చాడు. చివరకు ప్రాణం విసిగి వాడి మూడో అన్న, "నీ నల్లరంగు చూడగానే రాజుగారు నీకు పిల్ల నివ్వనంటాడో ఏమిటో? మరీ సంబరపడక నోరు మూసుకో," అని కోప్పడ్డాడు.

"ఏం నల్లగా ఉంటే? చెంచులు నల్లగా ఉండరూ?" అన్నాడు మిత్రుడు వింతగా.



"ఆ మాటే రాజుగారికి తెలియరాదు. ఆయనకి చెంచులంటే చాలా అసహ్యం," అన్నారు అన్నలు.

"అయితే ఆయన మీకు పిల్లల్నిచ్చి ఎలా పెళ్ళిచేశాడు?" అన్నాడు మిత్రుడు.

"మేము చెంచుల మని ఆయనతో చెప్పలేదు. మాగధుల మన్నాం. నువ్వూ ఆ మాటే అనాలి," అన్నారు అన్నలు.

"నే నలా ఏమీ చెప్పను. చెంచు నని చెప్పుకోవటానికి నాకు నామోషీ ఏమీ లేదు," అన్నాడు మిత్రుడు.

అన్నలకు వాడి ధోరణి చూస్తే భయం వేసింది. వాణ్ణి ఏ నదిలో నన్నా పారేస్తే తప్ప తమ ముగ్గురికీ ప్రమాదం వస్తుందని వాళ్ళు అనుకున్నారు. మూడో అన్నకు మిత్రుణ్ణి చంపెయ్యాలన్న ఆలోచన తీవ్రంగా ఉంది. పెద్దవాడికి మాత్రం మిత్రుడంటే కొంత ప్రాణం పీకుతున్నది. అతనే మిత్రుణ్ణి తన గుర్రం మీద తీసుకు పోతున్నాడు కూడానూ.

ఒక రాత్రి వాళ్ళు అరణ్యప్రాంతంలో మజిలీ చేసి, తిండి తిని పడుకున్నారు. మిత్రుడు నిద్రపోగానే, తాము గుర్రా లెక్కి సాగిపోవాలనీ, వాడి గతి ఏమైతే అది అవుతుందనీ వాళ్ళ ఉద్దేశం.

అయితే గుర్రాల సకిలింపుకు మిత్రుడు నిద్ర లేచి, తన అన్నలు గుర్రా లెక్కుతూండటం చూసి పెద్దపెట్టున ఏడిచాడు. మిగిలిన ఇద్దరూ తమ గుర్రాలను దౌడు తీయించి వెళ్ళిపోగల వాళ్ళే, కాని పెద్ద వాడు మిత్రుడి ఏడుపుకు తట్టుకోలేక, వాణ్ణి మళ్ళీ తన గుర్రం మీద ఎక్కించుకుని బయలుదేరాడు.

"నన్ను అడవిలో ఒంటిగా విడిచిపోదామనుకున్నారా?" అని మిత్రుడు అన్నలను అడిగాడు.

"లేదురా, నీ ధైర్యం చూద్దామని అలా చేశాం," అన్నాడు పెద్ద అన్న.

వాణ్ణి ఏం చెయ్యాలన్న సమస్య అలాగే ఉండిపోయింది. వాణ్ణి వదిలించుకోవాలని మూడో అన్న తొందర పడుతున్నాడు. వాడికి ఏ కష్టం వచ్చినా బాధ పడేటట్టుగా ఉన్నాడు పెద్దవాడు. రెండోవాడు మధ్యస్థంగా, "ఇంకా ఆలోచించటానికి వ్యవధి ఉన్నదిలే," అన్నాడు.

ఆ వ్యవధి కూడా అయిపోంది. వాళ్ళు వెళ్ళే నగరం రానేవచ్చింది.

రాజుగారి కోటను అనుకుని రాజుగారి పెంపుడు సింహాలుండే ఆవరణ ఉన్నది. దాని గోడ మీది నుంచి మిత్రుణ్ణి సింహాలకు వేద్దామని ముగ్గురూ నిశ్చయించుకున్నారు. ఈ పని తన చేతుల మీదుగా చెయ్యటానికి మూడో అన్నే సిద్ధపడ్డాడు. తన మూడో అన్న తనను చేతులతో ఎత్తి పట్టుకున్నప్పుడు మిత్రుడు అభ్యంతరం చెప్పలేదు. ఇది కూడా తన ధైర్యాన్ని పరీక్షించటమే కాబోలు ననుకున్నాడు. మిత్రుణ్ణి సింహాల ఆవరణలో పడేసి, ముగ్గురూ కోటకు వెళ్ళిపోయి, తమ తమ్ముడు చనిపోయాడని రాజుతో చెప్పారు.

లోపల పడిన మిత్రుడికి అదృష్టవశాన దెబ్బలు తగలలేదు. వాడొక సింహం మీద పడ్డాడు. సింహాలు వాడి చుట్టూ మూగి



వాసన చూశాయి గాని వాణ్ణి ఏమీ చెయ్యలేదు. వాటికి ఆకలిగా లేదు. బుల్లి రాజకుమార్తెకు ఆ సింహాలంటే చాలా ప్రీతి. అందుచేత ఆమె వాటికి శ్రద్ధగా కడుపు నిండా తిండి పెట్టిస్తుంది.

మిత్రుడు కూడా సింహాలను ఎరగడు. వాడు, పిల్లులనూ, కుక్కలనూ చేసినట్టుగా, వాటిని దువ్వాడు, వాటి చెవుల వెనక నిమిరాడు. ఆ రాత్రి వాడు వెచ్చగా వాటి మధ్య పడుకుని నిద్రపోయాడు.

మర్నాడు ఉదయమే రాజుగారి బుల్లి కూతురు, కల్యాణి, సింహాలకు తిండి పెట్టించటానికి వచ్చి, సింహాల మధ్య ఉన్న



మిత్రుణ్ణి చూసి, నిద్ర లేపి, "ఎవరు నువు? ఈ సింహల ఆవరణలోకి ఎలా వచ్చావు?" అని అడిగింది.

మిత్రుడు ఆమె అందం చూస్తూనే, "నువు రాజకుమార్తె కల్యాణి కదూ?" అని అడిగాడు.

"అవును నీ కెలా తెలుసు? నిన్నెన్నడూ చూడలేదే?" అన్నది కల్యాణి.

"నిన్ను గురించి చాలా చెప్పారులే. నిన్ను పెళ్ళాడటానికే నన్ను తీసుకొచ్చారు," అన్నాడు మిత్రుడు.

"అయితే ఇంతకూ నువ్వెవరు?" అన్నది కల్యాణి.

మిత్రు డామెకు తెలిసినదంతా చెప్పాడు. ఏడేళ్ళ పిల్లే గాని, కల్యాణి చాలా తెలివి గలది. "మా నాన్నకు ఆటవికులంటే అసహ్యం. నిన్ను చూసి చెంచువని మా నాన్న గుర్తిస్తాడని భయపడి, మీ అన్నలు నిన్ను ఇక్కడ పారేశారు. వాళ్ళు చాలా చెడ్డవాళ్ళు. నువు మంచివాడిలా కనపడుతున్నావు. మీ అన్నల సంగతి రహస్యంగా ఉంచుదాం. లేకపోతే మా అక్కలు ఏడుస్తారు. నిన్ను నా గదిలో దాస్తాను," అన్నది కళ్యాణి.

ఆమె మిత్రుణ్ణి తన సొంత గదిలోకి తీసుకుపోయి, తన కోసం సిద్ధంగా ఉన్న భోజనంలోనే అతనికి కూడా పెట్టింది. మిత్రుడు అక్కడే రహస్యంగా ఉండిపోయాడు. కల్యాణి రోజూ వచ్చి కబుర్లు చెప్పేది, ఆహారం తెచ్చి పెట్టేది. వాళ్ళిద్దరికీ మంచి స్నేహమయింది.

అయిదేళ్ళు గడిచిపోయాయి.

ఒకనాడు రాజుకు అనుమానం వేసింది, తన బుల్లి కూతురు అతి తరుచుగా తన సొంత గదికి వెళ్ళి కూర్చుని, గంటలు గంటలు ఎలా గడుపుతున్నదా అని. ఆయన ఒక రోజున అకస్మాత్తుగా అక్కడికి వెళ్ళి, మిత్రుణ్ణి చూసి, "ఎవరు నువు? ఇక్కడ ఏం చేస్తున్నావు?" అని అడిగాడు.



"ఈ అబ్బాయి చాలా మంచివాడు, నాన్నా. ఇతని బంధువులు, దుర్మార్గులు, ఇతన్ని మన సింహాలకు వేస్తే, నేను రక్షించి తీసుకొచ్చాను," అన్నది కల్యాణి.

"అటవికులు మహాదుర్మార్గులు, తెలీదా? వీడు ఇక్కడ ఉండటానికి ఏ మాత్రమూ వీల్లేదు. నువు అడివి మనిషితో స్నేహం చెయ్యటమేమిటి?" అని రాజు మిత్రుణ్ణి తన వెంట తీసుకుపోయి కాసావాడితో, "వీడికి గుర్రాల పని నేర్పు," అన్నాడు.

మిత్రుడు ఆ పని కూడా చక్కగా నేర్చుకున్నాడు. వాడికి మంచి దుస్తులిచ్చి, దివాణంలో పెద్దలు గుర్రా లెక్కేటప్పుడూ, దిగేటప్పుడూ సహాయం చేసే పని ఇచ్చారు.

ఒకరోజు మిత్రుడు తన పెద్దన్న నే గుర్రం ఎక్కించవలిసి వచ్చింది. పెద్దన్న వెలవెలబోతూ, "నీ పేరేమిటి?" అన్నాడు.

"మిత్రుడు," అన్నాడు తమ్ముడు. కాని తాను అన్నను గుర్తించినట్టు పైకి తెలియనివ్వలేదు. వాడికి లోపల మటుకు మండిపోయింది.

పెద్దన్న మిగిలిన అన్నలతో, "మన బుల్లి తమ్ముడు బతికే ఉన్నాడు. వాడు గుర్రాల పని చూస్తున్నాడు. మనం వాడి అన్నలమని వాడింకా రాజుతో చెప్పినట్టు లేదు. చెబితే రాజుగారు మనల్ని పొలిమేర దాకా తరమగొట్టేవాడే!" అన్నాడు.

"ఇంతవరకూ వాడు మన రహస్యం బయట పెట్టకపోతే ఇక త్వరలోనే బయట పెడతాడన్న మాట. వాడికి విషం పెట్టేద్దాం," అన్నాడు మూడోవాడు.

పెద్దవాడికి మిత్రుడంటే ఇంకా మమకారం ఉన్నది. వాడు చావనందుకు అతను చాలా ఆనందించాడు. కాని తొందరపడి తన తమ్ములకు చెప్పినందుకు మిత్రుడి ప్రాణానికి మళ్లీ ఎసరు వచ్చేటట్టున్నది. అందుచేత అతను మిగిలిన అన్నలతో, "ఆ విషమేదో నేనే చూస్తానులే," అన్నాడు.

అతను విషానికి బదులు మత్తుకలిగించే మందు సంపాదించి, దాన్ని వంటవాడికిచ్చి, "మిత్రుడికి పంపే భోజనంలో దీన్ని కలుపు," అని ఆజ్ఞాపించాడు. వంటవాడు అలాగే చేశాడు.

ఆ సాయంకాలం మిత్రుడు ఆ మత్తు భోజనం తినబోతూండగా కల్యాణి ఎవరికీ తెలియకుండా, గుర్రపుసాలలో ఉన్న మిత్రుడి వద్దకు వచ్చేసింది. ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ మిత్రుడి కోసం వచ్చిన భోజనం తినేశారు. ఇద్దరికీ త్వరలోనే నిద్ర ముంచుకొచ్చింది. అక్కడే మిత్రుడు తాను పడుకోవటానికి ఉపయోగించే కొయ్యపలక ఉండేది. ఇద్దరూ దాని మీద పడుకుని మత్తులో పడిపోయారు.

ఈ లోపల మూడో అన్న, మిత్రుడు ఇంకా చచ్చాడో లేదో చూతామని అక్కడికి వచ్చాడు, మత్తులో పడి ఉన్న రాజకుమార్తెనూ, మిత్రుణ్ణీ చూశాడు, పెద్ద అన్న వద్దకు వెళ్ళి, "నువు మోసం చేశావు. మిత్రుడు చావలేదు. నిద్రపోతున్నాడు. రాజకుమార్తె కల్యాణి కూడా నిద్రపోతున్నది," అన్నాడు.

"మరీ మంచిది. మన తమ్ముణ్ణి మన చేతులారా చంపి, పాపం ఎందుకు కట్టుకోవాలి? రాజుగారికి తెలిపితే చేసేదేదో వారే చేస్తారు," అన్నాడు రెండో అన్న.

మూడో అన్న వెళ్ళి, "మన కల్యాణి ఎవరితో స్నేహం చేస్తున్నదో ఒక్కసారి తిలకించండి," అంటూ రాజును గుర్రపుసాలకు తెచ్చాడు.

రాజుకు భరించరాని కోపం వచ్చింది. ఆయన భటులను పిలిచి, "వీళ్ళను ఇలాగే తీసుకుపోయి నదిలో విడిచి పెట్టండి," అన్నాడు. రాజభటులు ఆ పలకను మోసుకుపోయి నదిలో వదిలారు. అది ప్రవాహం వెంట కొట్టుకు పోసాగింది.

—[ముగింపు వచ్చే సంచికలో]





# దత్తాత్రేయదర్శనం

పూర్వం మగధదేశాన్ని దివాకరవర్మ ఏలుతూండేవాడు. ఆ కాలంలో మగధ వాసులు దత్తాత్రేయదర్శనం మహా భాగ్యంగా భావించేవారు. తమకు దత్తాత్రేయులవారి దర్శనం అయిందనీ, దాని ఫలితంగా తమకు వచ్చిన కష్టాలన్నీ తొలగిపోయాయనీ చాలామంది పౌరులు అంటూండేవారు.

ఒకసారి దివాకరవర్మకే అనేక క్లిష్ట సమస్యలు ఏర్పడ్డాయి. పరిపాలనలో విడని చిక్కులు సంప్రాప్తమయాయి. అదే సమయంలో కుటుంబ సమస్యలు కూడా ఆయనకు మతిస్థిమితం లేకుండా చేశాయి. ఆ పరిస్థితిలో ఆయన, "నాకిప్పుడు దత్తాత్రేయ దర్శనం సమకూడితే ఎంత బాగుండును!" అనుకున్నాడు.

ఆయన చాలారోజులు దత్తాత్రేయుణ్ణి తన మనసులో ధ్యానించి, తనకు దర్శనం ఇవ్వవలసిందిగా వేడుకున్నాడు. కాని ఆయన ధ్యానమూ, ప్రార్థనలూ ఏ మాత్రం ఫలించలేదు.

అందుచేత ఆయన ఒకనాడు దేశం అంతటా ఒక చాటింపు వేయించి, ఎవరైనా తనకు దత్తాత్రేయులవారి దర్శనం చేయించినట్టయితే వారికి కోరినంత ధనం ఇస్తానని ప్రకటించాడు.

రాజధానిలోనే ఒక మనిషి ఉండేవాడు. అతను ఒకప్పుడు బాగా బతికి, కాలం కలిసి రాక అప్పులపాలై అతి హీనస్థితికి వచ్చాడు. అతను రాజుగారి వద్దకు వెళ్ళి, "మహారాజా, నాకు వెయ్యి దీనారాలు దయచేయించినట్టయితే నేను తమకు నెల రోజుల లోపల దత్తాత్రేయ దర్శనం చేయించగలను," అన్నాడు.

రాజుగారు సంకోచించక తన బొక్కసం నుంచి వెయ్యి దీనారాలు తెప్పించి అతనికి

బి. విమలకుమారి

ఇస్తూ, "నీ మాటనమ్మి ధనం ఇస్తున్నాను. నువు అన్నట్టు నెలలోగా నాకు దత్తాత్రేయ దర్శనం కాకపోతే నీ తల తీయించేస్తాను," అని హెచ్చరించాడు.

"చిత్తం. అలాగే చేయండి," అని ఆ మనిషి ధనం తీసుకుని ఇంటికి వెళ్ళి, తన కున్న బాకీలన్నీ తీర్చేసి, తన భార్యా బిడ్డ లతో, "ఇక నేను పోయినా చింతలేదు ఋణవిముక్తిని మించిన ముక్తి ఏమున్నది? పరువుగా బతికాను, పరువుగా చచ్చి పోగలను," అన్నాడు.

అతను నెలరోజులు ఎప్పుడు పూర్తి అవు తాయా అని వేచి ఉండి, ఆఖరు రోజున తన భార్యకూ, బిడ్డలకూ వీడ్కోలు చెప్పి, రాజసభకు వెళ్ళి, "మహారాజా, ఈనాటితో నేను పెట్టుకున్న గడువు తీరిపోతుంది. తమకు దత్తాత్రేయ దర్శనం చేయించలేక పోయినందుకు తమ ఇష్టానుసారం నన్ను శిక్షించండి," అన్నాడు.

"ఈ వంచకుడికి ఏమి శిక్ష వెయ్యాలి?" అని రాజు తన మంత్రుల నడిగాడు.

ఒకరు శిరశ్ఛేదమనీ, ఒకరు కొరత వెయ్యమనీ, ఒకరు కండలు కోసి కాకు లకూ గద్దలకూ వెయ్యమనీ, ఒకరు ఉప్పుపాతరలో పూడ్చమనీ రకరకాలుగా చెప్పారు. ఇంతలో నిందితుడి వెనక నుంచి ఒక వృద్ధుడు రాజు ఎదటికి వచ్చి, "రాజా, నీకీ మనిషి ద్వారా దత్తాత్రేయ దర్శనం అయిందే, ఎందు కితని శిక్ష మాట ఆలో చిస్తున్నావు?" అని మరుక్షణం మాయ మయాడు.

"దత్తాత్రేయస్వామి సాక్షాత్కరించాడు! ధన్యుణ్ణి! ధన్యుణ్ణి!" అంటూ రాజు నింది తుడికి క్షమాపణ చెప్పుకుని, అతనికి అంతు లేని కానుకలిచ్చి, "బాబూ, వెయ్యి కాలాలపాటు దారిద్ర్యబాధ లేకుండా సుఖంగా బతుకు," అని ప్రశంసించి ఇంటికి పంపేశాడు.






హస్తినాపురానికి సమీపంలో ఉండే అరణ్యాలలో హిరణ్యధన్వుడు అనే యెరుకల రాజు ఒక డుండేవాడు. ఏకలవ్యుడు అతని కుమారుడు. ద్రోణుడనే ఆయన వద్ద దేశంలోని రాజకుమారులందరూ విలువిద్య నేర్చుతున్నారనీ, ఎక్కడెక్కడి నుంచో రాజకుమారులు వచ్చి ద్రోణుడికి శిష్యులై సమస్త అస్త్రశస్త్ర విద్యలూ అభ్యసిస్తున్నట్టూ ఏకలవ్యుడు విన్నాడు. అతను ద్రోణుడి వద్దకు వచ్చి, తనను కూడా ఒక శిష్యుడుగా చేర్చుకోమన్నాడు. ఆ కుర్రవాడు ఎరుకలవాడని తెలిసి, ద్రోణుడు అతన్ని శిష్యుడుగా చేర్చుకొన నిరాకరించాడు.

ఏకలవ్యుడు ఎంతో వినయంతో ద్రోణుడికి మొక్కి సెలవు పుచ్చుకుని, తన అరణ్యానికి తిరిగివెళ్ళి, ఒకచోట ద్రోణుడి బొమ్మ ఒకటి చేసిపెట్టి, బాణాలు ప్రయోగించటం అభ్యాసం చేయసాగాడు. ఈ అభ్యాసం ఫలితంగా ఏకలవ్యుడు విలువిద్యలో ద్రోణుడి శిష్యులందరినీ మించి పోయాడు.

ఒకనాడు ద్రోణుడి శిష్యులు వేటాడటానికి ఏకలవ్యుడుండే వనానికే వచ్చారు. వేటకుక్కలలో ఒకటి మిగిలిన కుక్కల నుంచి వేరై, జింకతోలు కట్టుకుని, మట్టి కొట్టుకుని, జుట్టంతా జడలు కట్టుకుపోయి ఉన్న ఏకలవ్యుణ్ణి చూసి మొరిగింది. ఏకలవ్యుడు కుక్క చేసిన ధ్వనినిబట్టి ఒకే సారి ఏడు బాణాలు వేసేసరికి, ఆ ఏడూ కుక్క ముఖంలో గుచ్చుకున్నాయి. అలా

8. ఏకలవ్యుడు



గుచ్చుకున్న బాణాలతోనే ఆ కుక్క మరింత గట్టిగా మొరుగుతూ, రాజకుమారుల వద్దకు తిరిగి వచ్చేసింది.

వాళ్ళు కుక్క ముఖంలో నాటిన బాణాలు చూసి, వాటిని వేసినవాడు చాలా గొప్ప విలుకాడై ఉండాలని గ్రహించి అతన్ని వెతుక్కుంటూ బయలుదేరారు. చివరకు వాళ్ళకు ఏకలవ్యుడు కనబడ్డాడు గాని వాళ్ళు అతన్ని గుర్తించక, "ఎవరు నువు? మీ తండ్రి ఎవరు? నీకు గురువెవరు?" అని అడిగారు.

ఏకలవ్యుడు వారితో, "నేను ఎరుకల రాజు కొడుకును. నా పేరు ఏకలవ్యుడు. నేను ద్రోణాచార్యులవారిని నా గురువుగా భావించి విలువిద్యాభ్యాసం చేస్తున్నాను," అని చెప్పాడు.

రాజకుమారులు హస్తినాపురానికి తిరిగి వచ్చి, ఏకలవ్యుడి సంగతి ద్రోణుడికి చెప్పారు. ఏకలవ్యుడు తన కన్న విలువిద్యలో గొప్పవాడై ఉంటాడని అర్జునుడికి బెంగపట్టుకున్నది. అతను ద్రోణుడితో, "నా కన్న గొప్ప విలుకాడు లోకంలో మరొకడు ఉండటానికి వీలులేకుండా నాకు శిక్షణ ఇస్తామన్నారు. కాని ఈ ఏకలవ్యుడికి నా కన్న హెచ్చు విలువిద్య నేర్పినట్టున్నారే?" అన్నాడు.

అర్జునుడీ మాట అన్నమీదట ద్రోణుడు మిగిలిన శిష్యుల కెవరికీ తెలియకుండా అర్జునుణ్ణి మాత్రం వెంటబెట్టుకుని, అరణ్యంలో ఏకలవ్యుడుండే చోటికివెళ్ళాడు.

విలువిద్యాభ్యాసంలో మునిగి ఉన్న ఏకలవ్యుడు ద్రోణాచార్యుడికి ఎదురువచ్చి నమస్కరించి, కూర్చోబెట్టి అతిథి మర్యాదలు చేసి, ఎదురుగా నిలబడి, "నేను తమ శిష్యుణ్ణి!" అన్నాడు.

"నువు నా శిష్యుడవే అయితే గురుదక్షిణ ఏమిచ్చుకుంటావు?" అని ద్రోణుడు ఏకలవ్యుణ్ణి అడిగాడు.



"గురుదక్షిణగా ఇవ్వరానిదంటూ ఏముంటుంది? నా ఈ శరీరమంతా తమదే," అన్నాడు ఏకలవ్యుడు.

"అలా అయితే నీ కుడి బొటనవేలు కోసి ఇయ్యి," అన్నాడు ద్రోణుడు.

ఏకలవ్యుడు ఏ మాత్రమూ సంకోచించక తన కుడి బొటనవేలు నరికి ద్రోణుడి కిచ్చాడు. అటు తరవాత అతను విల్లును ఎడమచేత పట్టుకుని, కుడిచేతి మిగిలిన వేళ్ళతో బాణాలు సంధించటం అభ్యాసం చేశాడు. కాని అతను విలువిద్యలో మొదట ఉండిన ప్రావీణ్యాన్ని పోగొట్టుకున్నాడు.



ఈ విధంగా అర్జునుడి భయాన్ని తీర్చి, ద్రోణుడు కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ అతనితో సహా హస్తినాపురానికి తిరిగి వచ్చాడు.

ద్రోణుడి దగ్గిర అన్ని విద్యలూ నేర్చుకున్నప్పటికీ కూడా పాండవులు వేరువేరు విద్యలలో ప్రవీణులయారు. ధర్మరాజు రథికుడుగా గొప్ప ప్రావీణ్యం సంపాదించాడు. గదాయుద్ధంలో భీముడూ, దుర్యోధనుడూ బాగా రాణించారు. అర్జునుడు విలువిద్యలో సాటిలేనివాడయాడు; ఈ విద్యలో అతని బుద్ధి బలమూ, శరసంధానంలో వేగమూ, శస్త్రాస్త్రప్రయోగ నైపుణ్యమూ మరెవరికీ రాలేదు. అశ్వత్థామకు తెలిసిన యుద్ధరహస్యాలు మరెవరికీ తెలియవు. నకులసహదేవులు కత్తి యుద్ధంలో హెచ్చుగా రాణించారు.

భీముడి గదాయుద్ధ కౌశలమూ, అర్జునుడి విలువిద్యాతిశయమూ చూసి దుర్యోధనుడు మొదలైనవాళ్ళు చాలా బాధపడుతుండేవారు.

ఒకనాడు ద్రోణుడు తన శిష్యులలో ఎవరి కెంత గురి ఉన్నదీ తెలుసుకోగోరి, ఒక బొమ్మగద్దను చేయించి, దానిని కనపడీ కనపడకుండా ఒక చెట్టు మీద పెట్టించి, శిష్యులందరినీ చెట్టు వద్దకు







"మీ రందరూ కనిపిస్తున్నారు," అన్నాడు ధర్మరాజు.

"నీ దృష్టి గురి పైన లేదు. నువు ఆ పక్షి తల తెగవెయ్యలేవు," అన్నాడు ద్రోణుడు. ఆయన మిగిలినవారిని ఒక్కొక్కరినీ ఇదేవిధంగా ప్రశ్నించాడు. అందరూ ధర్మరాజులాగే జవాబు చెప్పారు.

చివరకు అర్జునుడు వచ్చి పక్షి కేసి చూశాడు. మిగిలినవాళ్ళంతా కనిపిస్తున్నారా అని ద్రోణు డడిగితే, తనకు పక్షి తప్ప ఇంకేమీ కనబడటం లేదన్నాడు.

"బాణం వదులు," అన్నాడు ద్రోణుడు.

మరుక్షణం బొమ్మపక్షి తల తెగి కింద పడింది. ద్రోణుడు అర్జునుణ్ణి మెచ్చుకుని, ద్రుపదుణ్ణి యుద్ధంలో గెలవగలవాడు అర్జునుడేనని తన మనసులో అనుకున్నాడు.

ఒకనాడు ద్రోణుడు తన శిష్యులనందరినీ వెంటపెట్టుకుని యమునకు స్నానానికి వెళ్ళాడు. ద్రోణుడు నదిలో స్నానం చేస్తూ ఉండగా ఒక మొసలి ఆయన తొడను పట్టుకున్నది. మొసలిని బాణాలతో కొట్టమని ఆయన తన శిష్యులకు కేకపెట్టాడు. అందరూ బాణాలు వేశారు గాని ఒక్కరి బాణమూ మొసలికి గురిగా తగలలేదు. బాణాలు ఆయనకు తగులుతాయని వాళ్ళ

తీసుకుపోయి, "ఈ చెట్టు మీద ఉన్న పక్షి ఆకుల సందుగా జాగ్రత్తగా చూస్తే కనబడుతుంది. మీరందరూ విళ్ళకు బాణాలు సంధించి, నేను చెప్పగానే దాని తల తెగేటట్టు కొట్టాలి," అన్నాడు.

ఈ పరీక్షలో మొట్టమొదటి వంతు ధర్మరాజుది.

"బాగా చూడు. పక్షి కనిపిస్తున్నదా?" అని ద్రోణుడు అడిగాడు.

"కనిపిస్తున్నది," అన్నాడు ధర్మరాజు.

"పక్షితోబాటు నీకు నేనూ, మిగిలినవాళ్ళూ కూడా కనిపిస్తున్నామా?" అని ద్రోణుడు మళ్ళీ అడిగాడు.



భయపడ్డారు. ఒక్క అర్జునుడు మాత్రం అయిదు బాణాలు, గురువుగారి తొడకు తగలకుండా మొసలికే తగిలేటట్టు వేసి, మొసలిని చంపేశాడు.

ద్రోణుడు అర్జునుణ్ణి మెచ్చుకుంటూ, "అర్జునా, నీ నేర్పు చాలా గొప్పది. నీకు బ్రహ్మశిరోనామకాస్త్రం మంత్రసహితంగా ఉపదేశిస్తాను. దానిని మానవాతీతుడిపై ఉపయోగించవలిసిందే గాని సామాన్యుని పై ప్రయోగిస్తే లోకాలు దగ్ధమైపోతాయి," అన్నాడు.

అర్జునుడు అప్పటికప్పుడే స్నానం చేసి, శుచి అయి, ఆ బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని ద్రోణుడి నుంచి ఉపదేశం పొందాడు.

ఒకనాడు ద్రోణుడు ధృతరాష్ట్రుడి సభకు వెళ్ళాడు. అక్కడ వ్యాసుడూ, భీష్ముడూ, విదురుడూ, కృపుడూ, బాహ్లికుడూ, సోమదత్తుడూ మొదలైన పెద్దలందరూ ఉన్నారు. ద్రోణుడు ధృతరాష్ట్రుడితో, "మహారాజా, కుమారులందరూ ఇంతకాలంగా నా వద్ద విలువిద్య నేర్చుకున్నారు. వారి ప్రావీణ్యం పరీక్షించండి," అన్నాడు.

ధృతరాష్ట్రుడు ద్రోణుడితో, "మీరు మాకు మహోపకారం చేశారు. పిల్లవాళ్ళ విద్యాప్రదర్శనం ఎక్కడ జరిగేదీ, ఎప్పుడు



జరిగేదీ మీరే నిర్ణయించండి. మిగిలిన ఏర్పాట్లు నేను చేయిస్తాను," అన్నాడు.

ఆ ఏర్పాట్లు చేసే పని విదురుడికి అప్పగించారు. అవి బ్రహ్మాండంగా జరిగాయి. అస్త్రవిద్యాప్రదర్శనకు తగిన విశాలమైన ప్రదేశాన్ని శుభ్రంచేసి, రాళ్ళూ, పొదలూ తీసిపారేసి చదునుచేసి, ప్రేక్షకులు కూర్చునేటందుకు చుట్టూ ఇల్లులాగా కట్టి, ఉత్తరపు దిక్కున ప్రవేశద్వారం ఏర్పాటుచేశారు.

ఒక మంచి రోజున ప్రదర్శనకు ఏర్పాటు జరిగింది. ప్రదర్శన చూడటానికి పెద్దలందరూ బయలుదేరి వచ్చారు.



గాంధారీ కుంతీ మొదలైన అంతఃపుర స్త్రీలు పల్లకీలలోనూ, డోలీలలోనూ వచ్చారు. అందరూ ఎవరి స్థానాలలో వారు కూర్చున్నాక ద్రోణుడు అశ్వత్థామను వెంటబెట్టుకుని వచ్చి, రంగస్థలం మధ్య నిలబడ్డాడు. ఆయన శిష్యులందరూ కవచాలూ, విల్లులూ, బాణతూణీరాలూ ధరించి, చేతుల్లో రకరకాల ఆయుధాలు పట్టుకుని రంగం మీదికి వచ్చారు. అందరిలోకీ పెద్దవాడైన ధర్మరాజు ముందూ, మిగిలినవారు అతని వెనకా రంగప్రవేశం చేశారు.

అందరూ రథాల మీదా, ఏనుగుల మీదా, గుర్రాల మీదా రంగస్థలంలో అనేక విన్యాసాలు చేసి తమ అస్త్రకౌశలాలు ప్రదర్శించారు ; విలువిద్యలో తమ సామర్థ్యాలు చూపారు. బాణాలు తమ కెక్కడ తగులుతాయోనని ప్రేక్షకులు భయపడ్డారు. రంగస్థలంలో జరుగుతున్నదంతా ధృతరాష్ట్రుడికి విదురుడూ, గాంధారికి కుంతీ వివరిస్తూ వచ్చారు.

కొంతసేపయాక భీమదుర్యోధనులు గదలతో రంగంలోకి దిగి యుద్ధం ఆరంభించారు. అది ప్రదర్శన కొరకు ఏర్పాటు చేసిన యుద్ధమే అయినా ప్రేక్షకులు కొందరు భీముణ్ణీ, కొందరు దుర్యోధనుణ్ణీ రెచ్చగొట్టటం ప్రారంభించే సరికి ద్రోణుడు గదా యుద్ధం నిలుపు చేయించమని అశ్వత్థామను హెచ్చరించాడు.

చివరకు అర్జునుడు రంగస్థలం మీదికి వచ్చాడు. అతన్ని చూడగానే ప్రేక్షకులు హర్షధ్వానాలు చేశారు. ధృతరాష్ట్రుడు విదురుణ్ణి, "ఆ కలకలం ఏమిటి ?" అని అడిగితే విదురుడు చెప్పాడు.

అర్జునుడి ప్రదర్శనం ఊహించరానంత అద్భుతమనిపించింది. అతను దివ్యాస్త్రాలను ప్రయోగించి గాలీ, నిప్పూ, మేఘాలూ మొదలైనవి సృష్టించాడు. ఒక అస్త్రంతో అంతర్ధానమయాడు. అతని లక్ష్యసిద్ధి

అమోఘం. గుండ్రగా తిరిగే పందిబొమ్మ ముఖాన ఒకేసారి అయిదు బాణాలు కొట్టాడు. ఒక్క అవుకొమ్ములో ఇరవై ఒక్క బాణాలు గురి తప్పకుండా గుచ్చుకునేటట్టు వేశాడు.

కురవాళ్ళందరూ తమతమ విద్యలు ప్రదర్శించి, రంగస్థలం నుంచి నిష్క్రమించిన తరవాత అక్కడికి, సహజ కవచ కుండలాలతో బాల సూర్యుడిలాగా వెలిగిపోతూ, కర్ణుడు ధనుర్బాణాలు ధరించి వచ్చాడు. అతను ద్రోణాచార్యుడికీ, కృపాచార్యుడికీ నమస్కరించి, గంభీరమైన స్వరంతో, "ఓరీ, అర్జునా! ధనుర్విద్యలో నువే మొనగాడవనుకోకు. నువు ప్రదర్శించిన విద్యలన్నిటినీ నేను కూడా ప్రదర్శిస్తాను," అన్నాడు.

ఈ మాటతో అర్జునుడికి కోపమూ, అవమానమూ కలిగాయి; ప్రేక్షకులలో ఆసక్తి కలిగింది. నిజంగానే కర్ణుడు అర్జునుడు ప్రదర్శించిన విద్యలన్నీ తానూ ప్రదర్శించాడు. వెంటనే దుర్యోధనుడూ, అతని తమ్ములూ వచ్చి కర్ణుణ్ణి కౌగలించుకుని, అభినందించి, "ఈనాటి నుంచీ నువు మాకు ఆప్తుడివిగానూ, మాలో ఒకడివిగానూ ఉండు. మా శత్రువులను నాశనం చేసి, మాకు మేలుచెయ్యి," అన్నారు.

కర్ణుడు అందుకు సమ్మతించి, తనను అర్జునుడితో ద్వంద్వయుద్ధం చెయ్యనివ్వమని ద్రోణాచార్యుణ్ణి అడిగాడు. అర్జునుడు అందుకు సిద్ధమయాడు. తన కొడుకులు యుద్ధానికి తలపడటం చూసి కుంతి మూర్ఛపోయింది. చెలికత్తెలు ఆమెను సేదదీర్చారు.

అప్పుడు కృపుడు కర్ణుడితో, "నాయనా, నీ కులమేది? తల్లిదండ్రు లెవరు? నువు సుక్షత్రియుడివైతే తప్ప అర్జునుడు నీతో ద్వంద్వయుద్ధం చేయగూడదు," అన్నాడు.

కర్ణుడు తనను పెంచినవారి పేర్లు చెప్పటానికి సిగ్గుపడిపోయాడు.





# గాంధీ కథ

## 8

1904 లో ఒకనాడు గాంధీ జోహన్స్‌బర్గ్ నుంచి డర్బానుకు ప్రయాణం చెయ్యబోతుంటే పొలాక్ అనే పత్రికా విలేఖరి మిత్రుడు ఆయనకు "అంటు దిస్ లాస్ట్" అనే పుస్తకం ఇచ్చాడు. అది జాన్ రస్కిన్ అనే ఇంగ్లీషు రచయిత రాసినది. అందులో రస్కిన్ నిరాడంబర జీవితాన్నీ, శ్రమతో కూడిన జీవితాన్నీ శ్లాఘించాడు; ప్రజల సంక్షేమాన్ని పాటించని ఆర్థికనిపుణులను ఖండించాడు. గాంధీ విశ్వాసాలు ఆ పుస్తకం చదవటంతో మరింత బలపడ్డాయి. ఆయన డర్బానులో రైలు దిగేలోపల రస్కిన్ భావాలను అమలులో పెట్టాలన్న నిశ్చయానికి వచ్చేశాడు.

డర్బానులో "ఇండియన్ ఒపినియన్" అనే పత్రిక ఉండేది. దానికి సంబంధించిన ప్రెస్సును ఆర్బర్ట్ వెస్ట్ అనే తెల్లవాడు చూసేవాడు. అతను గాంధీకి మిత్రుడు. ఈ పత్రికను ఒక వ్యవసాయక్షేత్రం నుంచి ప్రచురించాలనీ, అందులో ఉండి పనిచేసే వారంతా చెమటోడ్చి జీవించాలనీ ఒక పథకం ఆలోచించి, గాంధీ దాన్ని గురించి వెస్ట్‌తో సంప్రతించాడు.

చెరుకుతోటల మధ్య నూరు ఎకరాల ప్రదేశం వెయ్యి పౌనులకు కొన్నారు. అది ఫీనిక్స్ రైలు స్టేషనుకు రెండున్నర మైళ్ళ దూరాన ఉండేది. ఆ క్షేత్రంలో మొదట నివాసాలు కల్పించుకున్న వారిలో పొలాక్, వెస్ట్, గాంధీ వెంట దక్షిణాఫ్రికాకు వచ్చిన బంధుగణమూ ఉన్నారు. అందులో ప్రెస్సుకుగాను ఒక పెద్ద చావడీ, నివాసాలకు గాను 8 ఇళ్లూ తయారయాయి.

ఈ సమిష్టి జీవితానికి ముఖ్యకేంద్రం గాంధీ ఉండే కుటీరం. ప్రతి ఆదివారమూ



ఆ కాలనీలో ఉండేవారంతా గాంధీ కుటీ రానికి చేరేవాళ్ళు. ప్రార్థనలు జరిగేవి. గీతా పఠనమూ, బైబిలు పఠనమూ, క్రైస్తవ ప్రార్థన గీతాలూ, గుజరాతీ భజనగీతాలూ ఉండేవి. జాతిమత వివక్షతలు ఏమాత్రమూ ఉండేవి కావు. గాంధీ మానవుల దురాశా ద్వేషాలకు దూరంగా ఉండి ఆత్మశోధన చేసుకోవటానికి అవకాశం లభించింది. కాని ఆయన వృత్తీ, రాజకీయాలూ ఆయనను ఎంతో కాలం ఇలా కూర్చోనివ్వలేదు.

గాంధీ 1906 లో, ఇంకా నలభై ఏళ్ళన్నా నిండక ముందే తన భార్యకు చెప్పి బ్రహ్మ చర్యవ్రత దీక్ష పూనాడు. అప్పటికే ఆయ నకు నలుగురు పిల్లలున్నారు. ఇంక సంతానం అవసరం లేదన్న ఆలోచనా, బ్రహ్మచర్యం నైతికబలాన్ని పెంపొందిస్తుం దన్న విశ్వాసమూ కలిసి ఆయనను అలా చేయించాయి. అయితే ఇది అనుకున్నంత తేలికగా కనిపించలేదు. నిగ్రహం కోసం గాంధీ రకరకాల భోజన విధానాలు మార్చి చూశాడు—ఉప్పూ, పప్పులూ, పాలూ మానేసి చూశాడు. ఉపోషాల వల్ల లాభం కనిపించింది. చివరకు ఆయన శరీరాన్ని అదుపులో ఉంచటం చాలదనీ, నిగ్రహించ వలసినది మనసుననీ గ్రహించాడు. ఒక్క కామాన్నే కాదు, అన్ని కోరికలనూ నిగ్ర హించాలి. కుటుంబ నియంత్రణ కాస్తా మోక్షసాధన అయింది.

గాంధీ బ్రహ్మచర్య దీక్ష పూనిన కొద్ది రోజులకే సత్యాగ్రహం ప్రారంభించవలిసి వచ్చింది.

1905, 1906 సంవత్సరాలలో ట్రాన్స్ వాల్‌లోని భారతీయుల పరిస్థితి చాలా హీనంగా తయారయింది. దక్షిణాఫ్రికాలోకి భారతీయులు ప్రవేశించకుండా చూడటానికి అధికారులు, లోగడ ఉన్న చట్టాలు చాల నట్టు, మరొక శాసనం ప్రకటించారు. ఆ శాసనం ప్రకారం ప్రతి భారతీయుడూ,

భారత స్త్రీ, ఎనిమిదేళ్ళు పైబడిన ప్రతి బిడ్డా రిజిస్టరు కాగితాల మీద వేలిముద్రలు వేసి రిజిస్టరు కావాలి. పెద్దవాళ్ళు తమ మైనరు పిల్లలచేత వేలిముద్రలు వేయించక పోతే జరిమానా, లేక జైలుశిక్ష, లేక దేశ బహిష్కరణ శిక్ష విధించవచ్చు. భారతీయు డైనవాడు తమ పర్మిట్‌లను ఎక్కడ బడితే అక్కడ, ఎప్పుడు బడితే అప్పుడు చూపించ టానికి సిద్ధంగా ఉండాలి. ఇదొక "కుక్క పట్టీ" శాసనం! ఈ శాసనం లేకమునుపే, అనుమతి పొందకుండా వచ్చినందుకు 150 మంది భారతీయుల పైన చర్యలు తీసు కున్నారు; ఒక స్త్రీని ఆమె భర్త నుంచి వేరుచేసి, దేశం విడిచి వెళ్ళిపోవటానికి ఆమెకు 7 గంటలు వ్యవధి ఇచ్చారు; ఒక 11 ఏళ్ళ కుర్రవాణ్ణి అరెస్టు చేసి, 30 పౌనుల జరిమానా, లేక మూడునెలల ఖైదు విధించారు!

కొత్తగా ప్రకటించిన శాసనం చట్టం రూపం పొందితే భారతీయుల గతి ఏమయేదీ గాంధీకి అర్థమయింది. అలాటి చట్టానికి గురికావటం కన్న భారతీయులు చావటం మేలు. కాని విజయమో, వీరస్వర్గమో తేల్చుకోవటానికి భారతీయులు ఏం చెయ్యాలి? గాంధీకి ఏమీ పాలుబోలేదు.



బోయెర్లకూ, బ్రిటిషు వారికీ జరిగిన యుద్ధంలో బ్రిటిషువారి విజయానికి తోడ్పడి నందుకు భారతీయుల స్థితి మరింత హేయమైపోయింది. బ్రిటిషువారికీ బోయె ర్లకూ సఖ్యత కుదిరింది, గాని ఉభయులూ భారతీయుల పట్ల ద్రోహానికే తలపడ్డారు. నేటాల్, ట్రాన్స్‌వాల్‌లలోని భారతీయులకు ప్రాథమిక పౌర హక్కు లిప్పించటానికి గాంధీ పన్నెండేళ్ళుగా సాగించిన కృషి యావత్తూ నీరుగారిపోయింది. ఆయన బహు కొద్దిమంది తెల్లవారిలోనూ, క్రైస్తవ మిషనరీలలోనూ, ఆదర్శదృష్టి గల యువ కులలోనూ మాత్రమే చైతన్యం కలిగించ

గలిగాడు. జనరల్ స్మట్స్ చెప్పినట్టు, దక్షిణాఫ్రికాను తెల్లవాళ్ళ దేశంగా చెయ్యటానికి ఆ తెల్లవాళ్ళు కంకణం కట్టారు. భారతదేశం నుంచి సహాయం వచ్చేది కల్ల. భారతదేశంలోనే భారతీయులకు హక్కులు లేవు, వలసలలో వారికి హక్కులిప్పించే శక్తి భారతదేశంలోని వారికెక్కడ ఉంటుంది? ఇక ఇంగ్లండువారి రాజకీయ దృష్టిలో దక్షిణాఫ్రికాలో ఉన్న ప్రభుత్వం స్వతంత్రమైనది; అక్కడి పాలకులు ఏమి చేసినా అడగడానికి లేదు. దక్షిణాఫ్రికాలోని భారతీయులు తమ హక్కుల కోసం తామే పోరాడాలి; వారికా ఓటు లేదు, శాసన సభలో ప్రాతినిధ్యం లేదు.

**1906** సెప్టెంబరు **11** న జొహన్స్‌బర్గ్‌లోని ఎంపైర్ థియేటరులో మీటింగు జరిగింది. జనంతో థియేటరు కిక్కిరిసిపోయింది. ఆసియావాసుల రిజిస్ట్రేషను నిబంధనను శిరసావహించరాదని సభవారు తీర్మానించినట్టుగా గాంధీ ఒక ముసాయిదా తీర్మానం తయారు చేశాడు.

ఉపన్యాసాలు చేసిన వారిలో ఒకడు ఈ శాసనానికి ఎన్నటికీ తలవంచను అని దేవుడి సాక్షిగా ప్రమాణం చేశాడు. వెంటనే గాంధీకి వెలుగు కనిపించినట్టయింది. కొత్త శాసనాన్ని ఎదిరించాలి! ఆస్తి పోయినా సరే, జైలుకు వెళ్ళవలసి వచ్చినా సరే, కొరడాదెబ్బలు తిన్నా సరే ఈ శాసనాన్ని ఆమోదించమని దేవుడు సాక్షిగా ప్రమాణం చెయ్యాలి. గాంధీ కోరిక పై సభలోని వారందరూ ప్రమాణం చేశారు. ఈ ప్రతిఘటన ఎలా ఉండబోయేదీ గాంధీ కింకా స్పష్టంగా తెలీదు. అందులో హింసాచర్యలు మాత్రం ఉండవు. రాజకీయ, సాంఘిక దురన్యాయాలను ప్రతిఘటించటానికి ఒక కొత్త సూత్రం అమలులోకి రాబోతున్నదని గాంధీ గ్రహించాడు. దానికి సత్యాగ్రహం అన్న పేరు స్థిరపడిపోయింది.



# 95. బ్రహ్మాండమైన రక్కసపువ్వు

"పూయా రేమాండియై" అనే ఈ రక్కస జాతి మొక్క మన అనాసకు దూరపు బంధువు. ఇవి దక్షిణ అమెరికాలోని ఆండీస్‌పర్వత ప్రాంతంలో ఏ విధమైన వృక్షజాతి కూడా గజం కన్న ఎత్తు పెరగని రాతిభూమిలో, పెరుగుతున్నాయి. మొక్క వయసు 150 సంవత్సరాలు వచ్చాక, అకస్మాత్తుగా దాని నుంచి 30 అడుగుల ఎత్తుకు పుష్పగుచ్ఛం లేస్తుంది. ఆ గుచ్ఛంలో సుమారు 8,000 పూలుంటాయి. పూసిన వెంటనే పుష్ప గుచ్ఛం ఎండి పోతుంది. ఈ పూలను కొయ్యాలంటే నిచ్చెనలు వేసుకుని ఎక్కాలి.

పుష్పగుచ్ఛం చుట్టు కొలత 8 అడుగు లుంటుంది.

ఈ మొక్కను 1870 లో మొదట కనిపెట్టిన వాడు ఆంటోనియో రేమాండీ అనే ఇటలీ దేశస్థుడు. అతని పేరనే ఇది "పూయారేమాండియై" అని పిలవబడుతున్నది.

మొక్క మీద 20 అడుగుల ఎత్తు లేచే పుష్ప గుచ్ఛకాండానికి 18 అంగుళాల నిడివిగల పూల రెమ్మలు బండిచక్రపు "ఆకు"ల లాగా అమరి ఉంటాయి.

దీని పూల నుండి వెలువడే విత్తులకు ఈక లుండి, అవి గాలిలో తేలిపోతాయి.

ఇక్కడి వాళ్ళు ఎండిన పూయామొక్కలను తగలబెడతారు. అవి దివిటీల లాగా వెలుగుతాయట.

పూయా జాతి చెట్లలో అనేక రకాలున్నాయి. అందులో ఒక రకం అడుగున్నర ఎతు మాత్రమే పెరుగుతుంది. కొన్ని జాతులను ఎర్ర ఇండియనులు పానీయం తయారు చెయ్యటానికి ఉపయోగిస్తారు, కొన్నిటిని తింటారు.



Photo by D. N. Shirke



బహుమతి
పొందిన వ్యాఖ్య

మహాత్ముని శతజయంతి నేడే!

పంపినవారు:
అనంతపూర్ స్టూడెంట్స్ ఎసోసియేషన్.

Photo by A. V. Ramamoorthy



బహుమతి
పొందిన వ్యాఖ్య

మానవాళికి నివాళి యిదే!

పంపినవారు:
అనంతపూర్ స్టూడెంట్స్ ఎసోసియేషన్.

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1969 డిసెంబర్ నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ అక్టోబర్ నెల ఆఖరు తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## అక్టోబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: మహాత్ముని శతజయంతి నేడే!

రెండవ ఫోటో: మానవాళికి నివాళి ఇదే!

పంపినవారు: అనంతపూర్ స్టూడెంట్స్ ఎసోసిఏషన్,

సిమెంట్ నగర్, (కర్నూలు జిల్లా)

బహుమతి మొత్తం రు. 20/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road. Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'




# మాధుర్య జీవితానికి క్యాడ్‌బరిస్!

## Cadbury's

విశిష్టమైన మరియు మీగడ పాల చాక్‌లెట్ అంటే క్యాడ్‌బరిస్...
ఇది ఆనందాన్ని కలుగజేస్తుంది. ఆరు విధములయిన
రుచులతో కూడిన ఆనందాన్ని మీరు
క్యాడ్‌బరిస్‌తో పొందగలుగుతారు.



ప్రతి చాక్‌లెట్ పాలయొక్క



గుణములు గలిగినది!

# 'ఇప్పుడు నా చురుకుతనాన్ని చూచి అందరూ ఆశ్చర్యపడుతున్నారు!'



కాని, కొన్ని నెలల క్రితము నీరసంతో నేను ఆఫీసు పని సరిగా చేయ లేక పోయాను. చివరకి ఒక డాక్టర్ని సంప్రదించాను.



డాక్టరు ఇలా అన్నారు: "మీకు కావలసినంత పోషణ లభిం చలేదు. హార్లిక్స్ త్రాగండి."



హార్లిక్స్ త్వరలోనే నాకు శక్తి ఉత్సాహములను కలి గించింది. ఇప్పుడు నేను ఓపికతో చురుకుగా పని చేయడం చూచి అందరూ ఆశ్చర్యపడుతున్నారు!

**హార్లిక్స్ వాడడం వల్ల శక్తి ఉత్సాహంతో వున్నాను!**

సరైన పోషణ లేక పోవడం వల్ల కలిగే నీరసము, అలసట కొన్ని సమయాల్లో ఉద్యోగమునకే హాని కలిగించవచ్చు. వీటికి ప్రతివిధిగా డాక్టర్లు హార్లిక్స్ సిఫార్సు చేస్తారు. హార్లిక్స్ అదనపు పోషణత్వాన్ని ఇచ్చి శక్తి ఉత్సాహము, మంచి ఆరోగ్యము కలుగచేస్తుంది.




# హార్లిక్స్ అదనపు శక్తిని కలుగజేయును!

HL. 7486

## పిల్లలు అభిలషించే రకాలు

బ్రిటానియా జూలాజికల్ బిస్కట్లు అందంగా చిన్న చిన్న పక్షులు, జంతువుల రూపాలలో ప్రత్యేకంగా పిల్లలకు బ్రిటానియా తయారీ. రుచికరంగా కూడా వుంటాయి. పిల్లలు వీటిని తినేముందు వరుసగా చిన్న బిస్కట్ల జూతో ఆనందిస్తారు.

# బ్రిటానియా జూలాజికల్

బిస్కట్లు

**బ్రిటానియా** అంటే నాణ్యత







**ఆమెది ఎంతో చక్కటి ప్రాయం, ఏదో ఒక్కటి నేర్వగోరే ప్రాయం.**
**ఫోర్‌హాన్స్‌తో సక్రమమైన దంత సంరక్షణ నేర్చుకునే ప్రాయం.**

ఈ వయస్సులో, ఆమె, కుతూహలంతో, ఉత్సాహంతో, చైతన్యంతో ఉఱకలు వేస్తూ ఉంటుంది. ఈ సమయంలో, మీరు నేర్పినది యేదీ, ఏనాటికీ, ఆమె మరచిపోదు. కాబట్టి, ఉపయోగకరమైన విషయాలన్నీ ఆమెకు ఇప్పుడే నేర్పండి—ఫోర్‌హాన్స్‌తో సక్రమమైన దంత సంరక్షణ చేసుకొనుట వంటివి.

ఫోర్‌హాన్స్ దంత వైద్యునిచే సృష్టించబడింది. దీనిలో పనుచిగుళ్ల రక్షణకై ప్రత్యేకమైన యాస్ట్రింజెంట్స్ ఉన్నాయి. అందుచే, పనుచిగుళ్ల బాధలను, దంతక్షయాన్ని, అది దూరం చేస్తుంది. అది మీకెంత అనువైనదో, మీ బిడ్డకుకూడా అంతే అనువైనది. ప్రొద్దున పూట, రాత్రి పూట, నియమానుసారం, ఫోర్‌హాన్స్‌తో పళ్లు తోముకొనుట మీ బిడ్డకు నేర్పండి.




**ఫోర్‌హాన్స్ దంత సంరక్షణ ఎంత లేత ప్రాయములో నేర్పితే అంత ఉత్తమం.**

ఉచితం! "దంతములు, చిగుళ్లను గురించి తీసుకోవలసిన శ్రద్ధ" అనే వివరణాత్మకమైన చిన్న రంగుల పుస్తకం.*
దంతములు, చిగుళ్లను గురించి తీసుకోవలసిన శ్రద్ధ:
+ మీకు కావలసిన భాషలో ఈ చిన్న పుస్తకం కావాలంటే, తపాలా ఖర్చుల నిమిత్తం, 15 పైసల ... మనేర్స్ డెంటల్ అడ్వైజరీ బ్యూరో, పోస్ట్ బాగ్ నం. 10031, బొంబాయి-1 కి పంపండి.

పేరు ______________ వయస్సు ________

చిరునామా ______________

+ మీకు ఏ భాషలో పుస్తకం కావాలో, దాని క్రింద గీతగీయండి: ఇంగ్లీషు, హిందీ, మరాఠీ, గుజరాతీ, ఉర్దూ, బెంగాలీ, తమిళం, తెలుగు, మలయాళం, కన్నడం.

* మీ బిడ్డకు ఉత్తమమైన పుస్తకాలలో ఇదికూడా ఒకటి కావచ్చు

**ఫోర్‌హాన్స్**
**టూత్ పేస్టు—**
**ఒక దంతవైద్యుడు నిర్మించినది**

"C. 1"    67 F-182 TL.


రెడ్డి అండ్ కంపెనీ వారి తొలి చిత్రం
ధర్మపత్ని
దర్శకుడు: బి.ఎ. సుబ్బారావు నిర్మాత: ఎం. జయరామిరెడ్డి
సంగీతం: ఎస్. రాజేశ్వరరావు
పూర్ణా రిలీజ్
Kalanikatan
KE

# AWARDS!

## WON PLENTY

YET WE DON'T SAY
WE ARE THE BEST

ONLY
WE DO OUR BEST.



**PRASAD PROCESS PRIVATE LTD**
CHANDAMAMA BUILDINGS MADRAS-26

